శ్రీరామచంద్రాయనమః.

# కామమంజరీ పరిణయము

## ( వీధి నాటకము )



ఇది

పల్నాడుతాలూకా శ్రీగిరిపాటి

సరికొండ రామరాజకవిచే రచియింపఁబడి,

నరసారావుపేట తాలూకా కొత్తపల్లి పురవాసుఁడగు

కోమటినేని వీరయ్యగారి ద్రవ్యసహాయముచే


తెనాలి

రజత ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 500 ప్రతులు.



కృతికర్త,

మహారాజశ్రీ కోమటినేని వీరయ్యగారు.

శ్రీమత్పరదేవతాయైనమః.

ఈ కవిచే రచియింపబడిన చిత్రాశ్వచరిత్రము నా నేత్రోత్సవంబుగాఁజూచితి నందెచ్చ్చటేని కొలఁది దోసములు వాసించుఁగాక. ఐననేమి గుణబహుళత కావ్యము దర్శనీయమే యగును !

కలంకితుఁడు కుముదబంధుఁడు ప్రశంసాస్థానమగుట నిరూఢధర్మమేగదా !

మధురిమము ప్రౌఢిమము, అక్షరవిన్యాసమున ఆమూలాగ్రము వ్యాసంగించుచుండెను !

మధుర మకరంద ఝరీపరిణామముచే సుకవితాధార సొబగులీనుచున్నది !

ఆయుష్మంతుఁడీ వ్యవసాయమున నిరంతరాభినివేశ ధీవిషయుఁడగుత మని పల్కెదను.

ఇట్లు,
వారణాసి సీతారామశాస్త్రులు,
వైయాకరణి, బెజవాడ.
27-5-26.
తెనాలి.

తెనాలి,
28—5—26.

శ్రీ సరికొండ రామరాజుగారు రచించిన చిత్రాశ్వచరిత్రముఁ దిలకించితిని.

అందుఁ గవిత్వము లక్షణయుక్తమయి, సరసమై యొప్పుచున్నది. భావములు హృద్యములుగా నున్నవి.

ఈ కవితావతంసుఁడు కవితాతత్త్వమునఁ జక్కని పరిశ్రమ చేసినట్లు తెలియకపోదు.

ఇట్లు,
మహాకవిబ్రహ్మ,
బలభద్ర బాలచెన్నయ్య.

శ్రీ హయగ్రీవాయనమః.

# కాంచనమంజరీపరిణయము.



శా॥ శ్రీనీలాంగఘనంబునన్గనకపుం♦ జేలంబు గ్రొమ్మించువా
చానాదంబులగర్జితంబతిపటి♦ ష్ఠప్రవాతసస్యంబుపై
నానాభంగిఁ గటాక్షవృష్టిఁగురియు♦ న్నామ్ముకు నిత్యాశ్రితా
ధీనున్గోమటినేని వీరయను సం♦కృప్తున్దగ జ్జేయుతన్

శి వ ప్రా ర్థ న ము.

ఉ॥ శ్రీమహిళాసరస్వతిశ ♦ చీముఖనిర్జరభామలాత్మల
న్బ్రేమరకుండఁ గొల్వఁగడి ♦ నింపుజనించెడి పార్వతీసతి
న్నామమెలర్పఁగాఁగలయు ♦ శంభుఁడు కమ్మకులీనుఁడైనమా
కోమటినేని వీరయకుఁ ♦ గూర్చు సమంచితసుష్టసిద్ధులన్

బ్ర హ్మ ప్రా ర్థ న ము.

మ॥ చతురాస్యంబుల వేదనాదములు భా ♦ సక్రీతిఁ జృంభించనా
యతవాతావాతిఁ గల్గునావయుతమౌ ♦ ధాత్రిన్దగన్బోల్చు ప
ద్మతమున్బొల్చి సరోజపీఠమునుల ♦ వ్యాకన్నుతుల్సేయు వా
క్సతితోఁ గొల్వగు నల్వవీరయనిల ♦ జ్జైవాత్మనిన్జేయుతన్

—♦ స ర స్వ తి ప్రా ర్థ న ము. ♦—

చ॥ నయముగ నేనొనర్పఁగల ♦ నాటకమందున వీనపాకము
న్ప్రియమునఁగూర్చి ముద్రసన ♦ రాజపథంబున సంచరింపుచు
న్భయహరమైన కొత్తపలి ♦ పట్టణవాసతినొప్పునట్టి వీ
రయకుసమస్త శాస్త్రముఖ ♦ రార్థములన్నియు గూర్చుభారతీ

## విఘ్నేశ్వర ప్రార్థనము.

కం॥ శరజన్మునకును భైరవ
వరునకు వీరునకు నగ్రభవుఁడగుచును శం
కర పార్వతులను దనిపిన
కరిముఖునిఁ దలఁతు విఘ్నకారణుఁడగుటన్

## హనుమంతుని ప్రార్థనము.

మ॥ బలవద్వైరికృతాంతు సన్నుతగుణ వ్రాతు ప్రశాంతున్దయా
కలితస్వాంతు సురూప నిర్జితరతీకాంతు న్రఘూత్తంసుని
ర్మలపాదాబ్జనిశాంతు సూరి నుతధీమంతున్ హలావంతు మా
బలవంతున్హనుమంతుఁగొల్తు శుభసంభావ్యంబుఁ జేకూరగన్.

## కవిప్రార్థనము.

సీ॥ వల్మీకజాతుని వ్యాసుని శ్రీహర్షుఁ
గర్ణామృతకవీంద్రుఁ గాళిదాసు
భవభూతిఁ దండిభారవి శివదాసుఁ బా
ణుని భట్టనారాయణుని మయూరుఁ
బిల్హణు వామను మల్హణుశివభద్రు
సౌమిల్లిని సుబంధు హేమచంద్రు
భట్టగోపాలుని ప్రవరసేనుని మాఘు
వరరుచి రాజశేఖరు మురారి
తే॥ గీ॥ మొదలుగాఁగల్గు గీర్వాణముఖ్యకవుల
పాదసరసీజములు మదిఁ బ్రస్తుతించి
ప్రౌఢతరమైన యాంధ్రప్రబంధములను
లలినొనర్చిన నన్నయాదులనుఁ దలఁచి

### —♦ కుకవిపరిహాసము ♦—

మ॥ విరతి ప్రాసనుశబ్ద గుంభనరసా ♦ విఖ్యాత భావక్రియా
కరణార్థధ్వనిరీతి శయ్యలమహా ♦ కావ్యంబులన్నత్కవీ
శ్వరులున్జెప్పఁగఁ దుష్కవుల్బదులు జె ♦ ప్పన్జూతురెట్లంటిరా
హారుఁడున్నాడపమాడ నాడవే నమ ♦ స్తాశా పిశాచంబులున్

### —♦ గురుప్రార్థనము ♦—

మ॥ ననుఁగారుణ్యముచేత శిష్యుఁడని యా ♦ నందించి రావించి శ్రీ
రినవిద్యల్లదివించి సత్సభలఁ గీ ♦ ర్తిన్నాకుఁగల్పించి మిం
చిన నద్దేపలి సోమనాథగురునిఁ బ్రియుస్కు నిన్నాత్రశ్లో
ధనునిన్గొల్తు నిరంతరంబు బుధవం ♦ ద్యస్వామిఁయుంచున్భక్తిన్

### —♦ గ్రంథకర్తవంశావళి ♦—

సీ॥ వసుధఁ గోమటినేని ♦ వంశుండు వీరయ్యఁ
దలఁపనేపుణ్యాత్ముఁ ♦ దాతయయ్యె
అతులిత వేంకట ♦ ప్పయ్య ధార్మికశాలి
దయమీఱనేధీరుఁ ♦ దండ్రియయ్యె
ఘనసురూపంబునఁ ♦ దనరిన యాదమ్మ
తగవొప్ప నేధన్యుఁ ♦ దల్లియయ్యె
సరసపతివ్రతా ♦ చారిణి కనకమ్మ
పరగనే శుభమూర్తి ♦ భార్యయయ్యె
తే॥ గీ॥ చారుశీతల యుతవారి ♦ పూరమైన
బావిఁద్రవ్వించి యేదాని ♦ బరఁగెఁగీర్తి
అట్టికోమటినేని వం ♦ శాబ్ధిచంద్రుఁ
డైనవీరయ్యయొక్క నాఁ ♦ డతిముదమున

కం॥ మతిమంతులైన పౌరో
హితబాంధవ మంత్రిసుభట ♦ హితులాదిజనుల్

కుతుకము నందనను(గొల్వఁగ
శతమన్యునిఁబోలి కొలువు ♦ నల్పుచుఁ బ్రీతిన్

కం॥ తనమేనమామకొమరుఁడు
ఘనకీర్తి దిగంతరుండు ♦ గాంభీర్యాఢ్యుం
డనుపమ విద్యాశీలుం
డనఁదగు గంగూరికోట ♦ యనుఁగనిపలికెన్

కం॥ వనము కృతినగ్రహారము
ధననిక్షేపంబుఁ జెర్వుఁ ♦ దనయుఁడు గుడియున్
న్వనసప్త సంతతులునివి
యనఘా కృతి వీనిలోన ♦ నధికతఁ జెందున్

తే॥ గీ॥ అట్టికృతిఁబొంది యశముఁ జేఁ ♦ గట్టికొనఁగ
వలచియుంటిని సత్కవి ♦ వరునిఁ దెలుపు
మనఁగఁ గోటయ్యసంతోష ♦ మావహిల్లఁ
బలికెమాధుర్యమైన సం ♦ భాషణములు

సీ॥ గురిజాలసీమ శ్రీ ♦ గిరిపాటి వాసుండు
సరికొండ వంశాబ్ధి ♦ శశిధరుండు
రాణించుఁ గోటను ♦ రాజ కుమారుండు
సుబ్బరాజునకును ♦ సోదరుండు
పరికింపఁ బిచ్చమాం ♦ బాగర్భ జనితుండు
హరిపాదభక్తిత ♦ త్పరయుతుండు
తతసోమనాధ పం ♦ డితవర్య శిష్యుండు
రామరాజ కవీంద్ర ♦ నామకుండు

తే॥ గీ॥ సరససాహిత్యవిద్యావి ♦ శారదుండు
గలఁడు బిలుపించి తాంబూల♦ ములమి నొసఁగి
నవరసాస్పదమైనట్టి ♦ నాటకంబుఁ
జేయఁగోరుము నీకీర్తిఁ ♦ జెలఁగుదిశల

వ॥ అని దెలిపిన సంతసించి వీరయ్యా నన్ను తత్క్షణంబ పిలుపించి తాంబూలాంబర సువర్ణ భూషణంబులొసంగి నీవు రచింపఁబూనిన కామమంజరీ పరిణయనాటకంబు మత్పురనివాసుండగు శ్రీరామున కంకితంబుఁగా నొసంగుమనిన నేను సంతుష్టాంతరంగుండనై వీరయాఖ్యుని వంశం బభివర్ణించెద నెట్లనిన.

సీ॥ ధర్మమార్గముఁదప్ప ♦ ధర నధర్మమునఁగా
లూనరు కోమటి ♦ నేనివారు
తమకులాచార ప ♦ ద్ధతిమీాటి చరియింపఁ
గానరు కోమటి ♦ నేనివారు
గజరాజవరదుని ♦ భజనమనంబుల
మానరు కోమటి ♦ నేనివారు
కలహించువారలఁ ♦ గని పక్షపాతంబు
బూనరు కోమటి ♦ నేనివారు

॥తే॥ గీ అట్టి కోమటినేని వం ♦ శాబ్ధి పూర్ణ
సోముఁడనలాత్ముఁగను దృష్టి ♦ సోఁక నట్టి
కాముఁడాఁ శ్రిత సుకవిని ♦ కరమనోభి
రాముఁడనఁదగు వీరయ్య♦నాముఁడవని.

చ॥ సరసగుణుండు వీరయ ప్ర ♦ శస్తివహించిన లక్ష్మిదేవినిఁ
బరిణయమాడి యాపతి న ♦ పార సుఖాంబుధిఁ దేల్చి ధర్మత
త్పరులగు పుత్రులేవురి ము ♦ దంబునఁగాంచెను మున్ను పాండుభూ
వరుఁడు దయాఢ్యులైన సుత ♦ పంచకము న్ననురీతిఁదోఁపఁగ౯.

సీ॥ నయశాలులైన పే♦రయ వేంకటప్పయు
వేంకయ సరసయు ♦ వేంకటపతు
లను ధర్మభీమ ఫా ♦ ల్గున నకులసహ దే
వుల కుపమానులై♦గలిగి రవని

ప్రథితధర్మ్ములు భుజా ♦ బలులు విజయులు మ
హారూపయుతులు వేదాంతవిదులు
అని కవిపుంగవు ♦ లవనీశ సభలలోఁ
బద్యముఖంబులఁ బ్రస్తుతింప
తే॥గీ॥ వినియుఁ జుట్టాలు సుజనులు ♦ వేడ్క జెంద
దుష్టతతిలోభిమానవుల్ దుఃఖపడఁగ
నెగడిరమలాత్ములగువారి ♦ నిర్మలంపు
కీర్తిదిగ్దంతిదంతసం♦కీర్ణమయ్యె.

సీ॥ అందబద్ధఁపుమాటఁ ♦ జెందు నిద్రనుఁగను
కలనైన నొకసారి ♦ బలుకలేఁడు
చెనటులతోఁ జెల్మిఁ ♦ జేయఁడేఁ నాఁడైనఁ
బలుమాటలాడు స్వ ♦ భావిగాఁడు
పరులసొమ్మొపుడైన ♦ గరళంబువలెఁజూచుఁ
గులధర్మఁదప్పని ♦ గుణగణుండు
తగినపెద్దలఁగని ♦ దాసుఁడై విహరించు
బహుశాంతచిత్తుఁడై ♦ పరిఢవిల్లు
తే॥ గీ॥ సకల పౌరాణిక గ్రంథ ♦ సంఘములను
వినితదర్థము లాత్మలోఁ ♦ బ్రీతిఁజేయు
మానుషయుతుండు ♦ కోమటి నేనివంశ
వార్థిచంద్రుండు వేంకట ♦ ప్పయఘనుండు.

ఉ॥ ఇమ్మహి వేంకటప్పయ మ ♦ హీ తనయాసమబుద్ధిశాలి నా
దమ్మనుఁ బెండ్లియాడి కుల ♦ ధర్మవిచక్షణు నొక్కపుత్రర
త్నమ్మును వీరయాన్నని యె ♦ దైత్యవిరోధి రమాంబతాంగి యం
దెమ్మెలుగుల్క మన్మథు న ♦ హీనగతిన్గనుకీర్తిఁదోఁపఁగన్.

సీ॥ తనకీర్తి కీర్వారుం ♦ డనుపమానందయు
తోలుపైఁగప్పక ♦ మూలకొదిఁగెఁ

దనధైర్యమునకు మే ♦ రునగంబు సాటిరా
కతి లజ్జగలిఁగియుఁ ♦ గతులుదప్పెఁ
దనరూపమునకుఁ గం ♦ దర్పుంతుసరిరాక
మతిజెసి కృశియించి ♦ యతనుఁడయ్యెఁ
దనదానమహిమకు ♦ వనదంబుతులగాక
కడువెల్లఁ బాటూని ♦ గట్లఁబట్టె

తే॥ గీ॥ అని రసాతలనాయక ♦ ఘనసభాంత
రములఁ గవులెల్లఁ గద్య ప ♦ ద్యములఁదనను
బొగడఁ జగతిని నెగడొందె ♦ బుణ్యగణ్యుఁ
డైన కోమటినేని వీ ♦ రయఘనుండు.

సీ॥ పుడమియే పతిహిత ♦ సొడఁజూపఁగానీక
నప్పాలో ముంచె ని ♦ జాధిపతిని
పద్మయే స్థిరచిత్త ♦ ప్రాణేశురొమ్మెక్కి
గెరలియా ఘనుపేరు ♦ క్రిందుఁజేసె
సర్వమంగళయేను ♦ చండికగిరిజయై
మగనిమచ్చికచేఁత ♦ సగముజేసె
భారతియేమిత ♦ భాషిణిపతితల
వాకిటనుండి పే ♦ ర్వాడఁజేసె

తే॥ గీ॥ అనుదుఁటుడమినిలక్ష్మిని ♦ హైమవతిని
వాణినిహసించి వీరయ్య ♦ భార్యకనక
మాంబపతికిని సంపద ♦ ల్కాతిఘనంబు
బలవిశేషము యశముసే ♦ ర్పడనొసంగు

ఉ॥ ఆకనకమ్మయందు సుగు ♦ ణాఢ్యుడు వీరయ వేంకటప్పయు
న్నీకరుఁడైనరామయను ♦ సింహబలుండగు నాసరయ్య న
స్తోకమణీషుడై కనియెఁ ♦ దొల్లిపృథాసతి యందు పాండు రా
జాకరమైన పుత్రతతి ♦ యంబునుగాంచిన రీతిఁదోపఁగన్.

కం॥ ఘనులగు వారలలోపల
 ననఘుఁడు శ్రీవేంకటప్ప ♦ యాఖ్యుఁడులక్ష్మ
 మ్మను పెండ్లియాడె బాంధవ
 జనతతిదగుననుచు మెచ్చఁ ♦ జగతీస్థలిపై

వ॥ ఇవ్విధంబున స్మృతిపతివంశం బభివర్ణించి నేను రచియింప బూనిన కామమంజరీపరిణయమునకుఁగథా విధానమెట్టిదియన

తే॥ గీ॥ విక్రమార్కుండు ♦ దనమంత్రవిద్యఁదివ్య
 గంబమునకునుఁ బ్రాణము ♦ తక్కలికనొసఁగి
 దానితోనొక్క పతిభక్తిఁ ♦ బూనుసుదతి
 కథవచింపుమనఁదివ్య ♦ గంబమనియె.

వ॥ రాజేంద్రా శృంగారాది నవరస ప్రధానసమంజసంబగు నొక్క యితిహాసంబు మద్వచన చాతురీధురీణత నెరింగింతు

ద్వి॥ విరివిగావినుఁడిసా ♦ వీరవంగాది
 వరదేశ్యములలోన- ♦ వర్ధిల్లుచుండు
 కొమరైనయుత్తర ♦ కురుదేశములను
 రమణీయమైనయా ♦ రాష్ట్రంబులందు
 పొందుగాశ్రీనాగ ♦ పురమొప్పుచుండు
 అందంబునను వరయో ♦ ధ్యకుఁ బోమ్మవెట్టు
 ధనదునిపురమును ♦ దగనిరసించు
 ఘనమైననాకంబుఁ ♦ గనినవ్వుచుండు
 ధరణినాపురినేలు ♦ ధర్మధ్వజుంను
 నరవరాధ్యక్షుండు ♦ నయకోవిదుండు
 దీనావనుండు సం ♦ దీపితకరుఁడు
 మానధనుండు స ♦ మ్యగ్భాషణుండు
 కందర్పసుందరా ♦ కారుండుఘనుఁడు
 ఇందీవరదళాక్షుఁ ♦ డినకాంతిశాలి

రయొకనాఁడు సభఁజేయ ♦ నుద్యుక్తుఁడైన
ప్రకటితంబుగఁజూచి ♦ ఫణిహారుఁడొకడు
మునుముందు సభఁజొచ్చి ♦ మోదంబుతోను
ఘనకొత్తపల్లిరా ♦ ఘువునిధ్యానించి

దరువు—సావేరిరాగము. ఆదితాళము.

వేత్రపాణివచ్చెను - ధర్మధ్వజుఁగొల్వఁగ వేత్రపాణివచ్చెను -
వేత్రపాణిబుధ-మిత్రుఁడగుచుఁ బ-ల్విత్రంబుగఁ ధన-వేత్రముఁ దిప్పుచు
వేత్ర—

మొలకమీసముదువ్వుచుఁ - దలపైనమెఱయుఁ - గలికితు
రాయిదిద్దుచుఁ- గిలకిలనవ్వుచు - వలఁగొనిమనుజులుఁ - బిలచినబలు
లుకకఁ - గులుకుచుఁ బిరబిర - వేత్ర—

వూనికొత్తపల్లని- నివసించుఁగోమటి - నేనివీరయనుఁ జల్లని
జానఁగుజూపుల-సంరక్షించెను- జానకిరాముని-లోనదలంచుచు॥ వేత్ర॥

వ॥ ఇవ్విధంబున వేత్రహస్తుండు సభామంటపమునకువచ్చి మార్తాం
డుని పగిదిదుర్నిరీక్షుండై నిలువబడియున్న నచ్చటనుండు ఫణిహారుండు
ఓరీ యెవ్వఁడవురానీవు అదురుగుండె పిరికికండలేక సభామండపము
నకుఁ ద్వరితగతితో వచ్చుచున్నాఁడవు. నీనామమెద్దియొ నీగ్రామమె
ద్దియొ సకలంబు వికలంబులేక సుకరంబుగాఁ జెప్పుమురా యోరి.
శహబాసు నాపూర్వోత్తర మడుగుచున్నావా, మంచిది చెప్పుచున్నాను
వినరా. నిత్యసత్యవ్రతుండు సత్యనయప్రభావ ధీనిధేయుండును, రాజ
కులాభరణుండును నాగపురి వరనివాసుండగు ధర్మధ్వజ మహారాజుఁ-
గారి వేత్రహస్తుండనురా. ఓరీ, ఇదియునుంగాక మాధర్మధ్వజమహా
రాజుగారు సభామండపమునకు వచ్చుచున్నారు. యీవస్త్రందిరద్దిసేయక
వద్దిక లలర పెద్దలమాదిరి ముద్దుగాఁ గూర్చుండుఁడి సభికులార అని
తెలుపవచ్చితిరా ఓరీ.

తే॥ గీ॥ మానవాధీశ్వరుండు ధ ♦ ర్మధ్వజుండు
మఱియు పార్శ్వంబులందు సా ♦ మంతనృపులుఁ
గొలువఁగావచ్చె సవ్వేళ ♦ గొలువుకూట
మునకు సంతోషమెదలోన ♦ మువ్విరిఁగొన.

దర్వు - సావేరి రాగం - ఆది తాళం.

రాజువచ్చెనుసభకు - ధర్మధ్వజమహా - రాజువచ్చెను సభకు - రాజువచ్చెఁ
గవిరాజఫలద సుర - భూజమటంచు - భూజను లెన్నఁగ॥ రాజువ॥

కనకరత్న సం - ఘటితకిరీటము - దన శిరమందున మెరయు - అనుపమమణి
మయ - హారంబులఁ గాంత్యుఖలదిక్కులను దొఱయ - మునుకొనిమాగధ
జనులుభళిరయని - కొనియాడంగను - కుతుక ముఁజెందు చు॥ రాజు॥

కెలకులభూమీ - తలనాయకతతి - నిలచిసంస్తుతులఁజేయఁ - గలహించెడి
వా - దులు ప్రతివాదులు - గనుఁగొని ప్రక్కలడాఁయఁ - దులరహితంబగు
వలకేలను భా - సిలు ఖడ్గంబును - ఝళిపించుచు మరి॥ రాజు॥

కోమటినేని సు - కులుఁడగువీరయ - నాముని కోరికలిచ్చి - భూమి కొత్త
పలివురి సువర్ణమయ - ధామముమదిలో మెచ్చి - క్షేమమనుచు - నివసించు
రాఘవుని - నామము చిత్త - ములో మఱుపొందక॥ రాజువ॥

వ॥ ఇవ్విధంబున ధర్మధ్వజమహారాజుగారు సభామండపమునకువచ్చి
ఓరీ! చోపుదార్ అయ్యా! మహాప్రభూ ధర్మధ్వజమహారాజేంద్ర భవ
దాజ్ఞ శిరసావహించి యుష్మత్పాదారవిందసన్నిధియందే వర్తిం
చుచున్నాను.

మంచిది. ఓరీ! వేత్రహస్తపురోహితప్రధానబంధుమిత్రకవిగాయక
నాటక వైతాళిక వందిమాగధ బృందంబులు డెందంబులనానందింప
సందడిఁజేయక మంద మధురాలాపంబు లుచ్చరింపుచున్నారురా...
మహారాజ తమయాజ్ఞానుసారంబున సమస్తజనులు సంతోషులై

యున్నారు...వేత్రపాణి సకలప్రధానులలో ప్రధానుండునగు మన నిజ దండనాథుఁడైన నీతిధ్వజుఁడు సభామండపమునకుఁ జనుఁదెంచినాఁడా?...అయ్యా! రాజశేఖర! ఇంతవరకు రాలేఁడు. ఈక్షణమే పిలుచుకవచ్చెద. కాని తమరీ రత్నఖచితంబయిన సింహాసనంబున నాసీనతఁజెందు సునాసీరునిభంగి రాజోత్తమా? ఇట్లు పేరోలగంబున్న ధర్మధ్వజ మహారాజుగారికి వేత్రపాణిపరాకులు దెలిపె నెట్లనిన,

సీ॥ శతకోటి మార్తాండ ♦ సమధిక ధామశుం
భత్ప్రతా పాన్విత ♦ బహుపరాకు
సకలరాజన్య మ ♦ స్తక కిరీటన్య స్త
వరరత్న భరపాద ♦ బహుపరాకు
అనుపమ ప్రతిపక్ష ♦ జనపర హార్యక్ష
బలశరభాఢ్యక్ష ♦ బహుపరాకు
కవిరాజ కృతకావ్య ♦ కల్పిత బిరుదాంక
భాసితామలకీర్తి ♦ బహుపరాకు

తే॥ గీ॥ మహితఘనదాన రాధేయ ♦ బహుపరాకు
వైభవ సురాధినాయక ♦ బహుపరాకు
ప్రథితపావన చారిత్ర ♦ బహుపరాకు
వసుధ నాగపురీశ్వర ♦ బహుపరాకు

వ॥ ఇట్లు పరాకులు దెలుపు చున్న వేత్రపాణిని జూచి ధర్మధ్వజుండిట్లనియె

ఉ॥ పృథ్విపరాక్రమక్రముఁడు ♦ భీకర జన్యరసాభుజాకళా
సాధ్వస శత్రుమండలుఁడు ♦ సత్యగుణాఢ్యుఁడు నిత్యభూరి స
త్యాధ్వర దీక్షితుండు విబు ♦ ధాధిప వైభవుఁడై చెలంగు నీ
తిధ్వజుఁ బిల్వనంపు మతి ♦ తీక్ష్ణగతి న్ఖరదండధుర్యుఁడా

వ॥ స్వామి! ధర్మధ్వజమహారాజేంద్ర తమయాజ్ఞ శిరసావహించి ఇప్పుడే పిలుచుక రాగలను.

ద్వి॥ ధర్మధ్వజునిమంత్రి ♦ ధర్మవర్తనుఁడు
నిర్మలచిత్తుండు ♦ నీతికోవిదుఁడు -
సలలితంబుగరాజ ♦ సభకు రాఁదలఁచి
తలపాగ జలతారు ♦ తళ తళమనఁగఁ
దిలకంబు సాదుతోఁ ♦ దిద్ది ముద్దుగను
మొలకమీసము గోట ♦ పొలుపుగాదువ్వి
తారహారము లుర ♦ స్థలమందు మెఱయఁ
బేరైన సేల్లప్పి ♦ ప్రీతితో వాసు
కోటుపైనను వట్టు ♦ కోటుఁదాఁ దొడఁగి
కోటుకు బిగువైన ♦ గుండీలు బెట్టి
మురువైన పనిగల ♦ ముచ్చులు దొడిఁగి
సురుచిరమగు పేము ♦ చువ్వఁ జేఁబట్టి
ఘనకొత్తపల్లి రా ♦ ఘవుని పాదములు
సమధికంబుగ నెంచి ♦ సభకరుదెంచె

దర్వు—ముఖారి రాగం—అటతాళం

నీతిధ్వజుఁడువచ్చెను - యీ రాజసభకు - నీతిధ్వజుఁడువచ్చెను -
చేతమున ముదమొదువఁగా - సూతసంతతిదలువఁగా - నీతిపరుఁ
డనిజనులు గొలువఁగ - భీతిచే రిపులుతెల్లఁబరువఁగ - నీ

వైరిజనల యకాలుఁడు - భూజననుత- వైభవసురపాలుఁడు-చారు
వాగ్వరశేషుఁడు - స్వర్ణమణిమయ భూషుఁడు - దూరితానిశ
సకలదోషుఁడు - తోయజాసన నిభమనీషుఁడు ॥నీ॥

అలకొత్తపలివాసుఁడై - కోమటినేనికులుని వీరయఁపాలుఁడై -
చెలఁగు రామునినామము - తలఁపులోనిడు నీమముఁ - గలుఁగు
వారల కగునుక్షేమముఁ - గలయువినఁడని దెల్పిసామము ॥నీ॥

వ॥ ఇట్లు నీలిధ్వజుండు సభకుఁ జనుదెంచి నిలువఁబడి యున్నఁజూచి ధర్మధ్వజుండిట్లనియె.

కం॥ వినుమో నీలిధ్వజ నా
తనయునఁ బిలుపించిచూడఁ ♦ దలఁపునఁగోర్కుల్
జెనఁగొనుచున్నవి యీ తృణ
మునఁ బిలుపింపుము ప్రతోష ♦ పూర్ణుడనగుదుః

వ॥ అనినవిని నీలిధ్వజుండు రాజోత్తమా తమచిత్తానుసరణంబుగా యీ తృణమే బిలుపించుచున్నాను.

ద్వి॥ మనుసన్నిభుండైన ♦ మనుజాధిపతికి
ఘనసుగుణమంజరి ♦ గాఁబోలుననఁగ
జనియించెఁ గామమం♦ జరి వార్థిపతికిఁ
జనియించు శ్రీరమా♦చందంబుగాను
కనకంబుమూసలోఁ ♦ గరిగించిపోయఁ
? నుమాయకున్నట్టి ♦ కడ్డియోయనఁగ
రమణీయలావణ్య ♦ రసమునఁబెఱిఁగి
గమగమవలచు చో ♦ క్కపు మొల్కయనఁగ
దనరారునాయింతి ♦ దగనొక్కనాఁడు
లినతండ్రి సభకేగఁ ♦ దలఁచి నెమ్మదిని
పట్టుపుట్టముఁగట్టి ♦ పైతాణిరవికె
కట్టులూడంగను ♦ గుత్తంబుగాను
దొడిగికాసులదండఁ ♦ దోగంపుమెడను
బడవైచిరత్నము ♦ ల్పసిఁడితోఁ జేయు
సకలభూషణములు ♦ సవరించిమేన
ముకురంబుఁజూచుచు ♦ ముంగురుల్దువ్వి

పనిబడీచెలులిరు ♦ ప్రక్కలరాఁగ
ఘనకొత్తపల్లి రాఘవునెఱనమ్మి

దర్వు—శహానరాగము—ఆదితాళం

కామమంజరీవచ్చె - కమనీయ కాంతులీనఁగ - రామలలామ
యనుచు - రచ్చలోజనులు మెచ్చఁగ ॥కామ॥
ఉన్మత్తపువ్వవతుగా - నుండు కుచ్చెళ్లుకాళ్లఁ - గ్రమ్మి గదలుచు
నుండ - కాముని శరముభంగి ॥కామ॥
అందెలు గల్లుగల్లని ♦ సందడిఁజేయుచుండఁగ
ముందుగా రాజహంసలు ♦ మందయానములననువఁగ॥ కామ॥
ఇలనుఁ గోమటినేని ♦ కులజుని వీరయాఖ్యుని
వలనొప్పఁ బ్రోచు కొత్త ♦ పలిరాఘవునిఁదలచుచు ॥కామ॥

తే॥ గీ॥ ఇట్లు సభఁజేరఁ జనుదెంచి ♦ యింపుతోఁడ
నవనివిభుపాదములకు సా ♦ ష్టాంగనతులు
సలిపి చలనంబులేని చం ♦ చలయనంగ
నిటలమునఁ గేలుఁగవమోపి ♦ నిలువఁబడియె.

వ॥ ఇవ్విధంబున నమస్కరించి నిలువంబడియున్న కామమంజరిని ధర్మ ధ్వజుండు చేరఁబిలచి ద్రాక్షాదరసపక్షంబులగు వాక్యంబులనిట్లనియె.

ఉ॥ అమ్మరొ నీకుఁజూడఁగ స ♦ మంచిత యౌవ్వనభారమాయె ని
కమ్ముగనీకుఁ దీటుగ వి ♦ ఖండిత శస్త్రధరావ రాత్మజుఁ
బ్రమ్మిన వేడ్కఁగాంచుటకు ♦ బంపెద విప్రుల నేఁడె నాకు మో
దమ్మొసఁగించుపుత్రివి గ ♦ దాగతి కుంజరి కామమంజరీ.

సీసార్థము

అనిపల్కి భూమీశుఁ ♦ డాత్మప్రధానియా
నీతిధ్వజునిజూచి ♦ ప్రీతితోడ

వినుమయ్య నాముద్దు ♦ తనయను నూతనవయో
భరితయయ్యెను దీని ♦ పటమువ్రాసి
పౌరోహితులచేతఁ ♦ బంపించి వెతకించి
తగు రాజతనయుని ♦ తత్క్షణంబె
బిలుపించి పెండ్లిఁ ♦ దలపెట్టఁగాను దిఁ ♦ గలిగెను కోర్కులిప్పుడు
మీహృదయమందు ♦ గలమాటనాకుఁజెప్పుడు ♦ వలనొప్పనీడు
వచ్చిన ♦ యెలనాగ పెండ్లిఁజేయక ♦ నిలిపినవాఁడు యముని
నిలయము జేరుట ♦ నిజమను శాస్త్రము ♦ తెలమితో నీవువినలేఁద
బ్రాహ్మణులనిప్పుడె ♦ పిలుపింపుమయ్య ధనశ్రీద.

కం॥ అని పల్కు రాజుమాటలు
విని నీతిజ్ఞుఁడు చాల ♦ వేడుకఁబడి యో
జనవర నీయిష్టంబుగఁ
దనయామణి పెండ్లిఁజేయఁ ♦ దగుఁ బరికింపన్.

స॥ మహారాజ పౌరోహితులఁ బిలుపింపుమంటిరిగదా ఇదుగో యీ క్షణమె బిలుపించుచున్నవాఁడ.

దర్వు—శుద్ధసావేరి రాగం—ఏక తాళం

బాఁపనయ్యలువచ్చినారు ♦ భూపతీంద్రుని సభకు వేగమె ॥బాఁప॥
యోపికగ కుచ్చెళ్ళుబోస్లో ♦ తేప తేపకుఁ దోఁపుకొనుచు ॥బాఁప॥
చిన్నపంచలతోఁడఁ బుడ్డి ♦ చెంబులు వ్రేలాడఁగట్టి ♦ వెన్నుపూసల
ధుముకులాడ ♦ మిన్నుమన్నుఁ దెలియకుండ ॥బాఁప॥
నీరుకావి దోవతులపై ♦ నీటుగాను గప్పుకొనుచు ♦ తీరుగా
విభూతి రేఖలు - దిద్దినట్టి మోములుఁదనర ॥బాఁప॥
పొంకమగు పంచాంగమును - చంకలందుఁబెట్టుకొని యే - శంక లేక
శృతులు శిష్యులు - చదువుచును వెనువెంటరాగ ॥బాఁపనయ్య॥
ధరను గోమటి సీమకయ - వరముఁడౌ శ్రీకొత్తపల్లి - పురమునందున
నిలయు రాముని స్మరణ మరువక మనములందు ॥బాఁపనయ్య॥

వ॥ ఇట్లు బ్రాహ్మణులు సభామండపమునకువచ్చిన నీతిధ్వజుఁడు ధర్మధ్వజునిజూచి రాజోత్తమా తమయానతిప్రకారము పౌరోహితులు తమసన్నిధికి వచ్చియున్నారు స్వామీ అనిన ధర్మధ్వజుండు బ్రాహ్మణులకు నమస్కరించి తగు నాసనంబులఁ గూర్చుండఁజేసి యిట్లనియె.

మ॥ వినుఁడీ భూసురులార రాజ్యములలో ♦ విశ్వంభరాధీశనం
దనులన్చక్కనివారల న్సుగుణుల ♦ న్తారుణ్యుల న్శాస్త్రశో
ధనులజ్జూచియు నందునొక్కనికి మో ♦ దంబుగ్గనజ్జూపి యీ,
ననఁబో డీపటమంత వెంటఁగొనిరా ♦ హారాలు మీకిచ్చెదన్.

వ॥ అనిపటంబుచేతికిచ్చిన బ్రాహ్మణులు మహాప్రసాదంబని సంతసించి అంగీకరించి బయలుదేరి తిరుఁగసాగిరెట్లనిన—

సీ॥ కుకురుకాశకరూశ ♦ కోసలవంగాంగ
చోళశకాంధ్రనే ♦ పాళసింధు.
కొంకణఘూర్జర ♦ కుంకణకాంభోజ
లాటవిదర్భ ♦ కర్ణాటగౌళ
సౌరాష్ట్రమాగధ ♦ సౌవీరకుంతల
యవనకళింగాది ♦ వివిధదేశ
ములరాజపుత్రులఁ ♦ దిలకించి పటముకుఁ
దగువారు గారని ♦ దిగులుఁజెంది
తే॥ గీ॥ తిరిగితిరిగియుసింహళ ♦ పురమునకుఁను
జేరినొకపూలతోఁటలోఁ ♦ జెట్టుక్రింద
రవ్వగాలియు విసరంగ ♦ బవ్వళించి
కూరుకులుజెందిరపుడు జో ♦ కొట్టినట్లు.

వ॥ తత్పురంబున—

దరువు ముఖారిరాగము ఏక తాళం.

దండధరుఁడు వచ్చెను-సభనఁ డుజనులు మార్తాండ తేజుఁడన ॥దండ॥
మండలాగ్రమున - ఖండిరిపులభూ - మండలిలోనన - ఖండుఁడ
ననుచును ॥దండ॥
నూగుమీసములను - గోట - బాగఁదీటుచును — తేగాకత్తి
గొని - లాగి తలను జరి-పాగఁజుట్టి గొప్ప - సోగకన్నుఁగవ -
రాఁగ మొందఁగను ॥దండ॥
వల్లెవాటుగాను - మూల - మళ్ళనేఁతగల నల్లసేలుఁగప్పి - తెల్ల
రాళ్ళ యుంటు - జోళ్ళ - కాంతి చె - క్కుళ్ళపైన నల్లి-బిల్లి -
గొనఁగమతి ॥దండ॥
పూని కొత్తపల్లెఁ - గోమటిసేని వీరయను - మానక ప్రోచిన-
జానకిరాముని-మానక దలచుచుఁ - మానసమందున - మతి
త్వరితంబుగ ॥దండధరుడు॥

వ॥ ఇవ్విధంబునఁ దండధరుండు సభకువచ్చి సభను వీక్షించి ఓ
నాటక పాటక పౌరాణిక కవి శాస్త్రేతిహాస విద్వాంసులార
మంత్రి పౌరోహిత బుధమిత్ర వైతాళిక వందిమాగధులార
సింహళేశ్వరుని కుమారుండయిన హేమాంగద మహారాజుగారు
సభకు వచ్చుచున్నారు మీరందరు హాజరుగా వచ్చి యున్నారు
గదా! అహా మేమందరము ఆ మహారాజుగారి రాకడ నిరీక్షించు
చున్నాము దండధర.

ఉ॥ అంగజుఁబోలు సుందరుఁడ ♦ పార్వతితేజుఁడు యాచకాళికి
న్నొంగు పసిండిమూట రిపు ♦ కోట్లజయించెడు శౌర్యశాలి స
త్సంగుడు మానవంతుఁడు ప్రశస్తగుణాఢ్యుఁడునై చెలంగు హే
మాంగదరాజు స్నేహిత స ♦ మన్వితుఁడై సభఁజొచ్చె నత్తరిన్.

దరువు—కాంభోజిరాగం—ఆదితాళం

వచ్చె హేమాంగదుఁడు సభఁజేరఁ - దనతోడిమిత్రుల — ముచ్చ
టలు వినుచుండి చెవులార పచ్చవిల్తుని రూపమునకు - వచ్చు

సాటినిలఁడటంచు - రచ్చలోపలుండు జనులు - ముచ్చటింపు
చుండఁగను ॥వచ్చెహే॥
వందిజనమానందమునఁ బొగడ - సామంతభూమిప - నంద
నులు పార్శ్వంబులను నెగడ - యెందు నంపులేక పౌరులు -
ముందుముందు నడువఁగాను - సుందరాంగులైనవార - సుదతి
మణులు నృత్తమాడ ॥వచ్చెహే॥
కనకమణిమయహార మురమందు - మెఱయంగ రాజిత - ఘన
కిరీటంబొప్ప శిరమందు-ననుపమానంబైన తేజం-బినునిపరిహసింపు
చుండ - మనసిజాభుఁడనుచు వనితలు - వెనుఁగులాడి జూచుచుండ
వచ్చెహేమాంగదు॥
మానకను మాకొత్తపలిపురిని-నివసించుఁ గోమటి-నేనివీరయనేలు
రాఘవుని-లోనఁదలఁచి విబుధలోకా-ధీనుఁడైన వేత్రపాణి-పూని
బహుపరాకులెలుపఁ - గానువినుచుఁ ద్వరితగతిని ॥వచ్చెహేమాం
గదు॥

కం॥ వినవోరి దండపాణీ
మన పువ్వులతోఁటఁ జూడ మక్కువగలై
నననకనునాతోరారా
చనిచూచియుఁ దిరిగివచ్చి సభఁగావింతుల్.

వ॥ ఇట్లు పల్కి దండధరుండు వెంటనంటిరా నుద్యానవనంబునకు హే
మాంగదుండు జనుదెంచి అచ్చటి వనప్రభావంబు దండధరునకుఁ
జూపుచు నిట్లనియె.

దర్వు—ముఖారిరాగము—అటతాళం

కనుఁగొనుమీా వనమహిమ - కలిగొట్టుపొదదంట- ఘనమరాగ
నల్లిగొని - ఇనకిరణములుఁజొచ్చ - కనుజల్లగాడ్పులకు - మనికి
పట్టైన యీా - మల్లెపొదలలోను - మనములలరఁగ సరసమా

ఱుచుఁ - గనులకింపగు విటులఁబోటులు - పెనఁగుటకు హా
యెంతవీలుగఁ - బెంపు జెందు చునున్న దిచ్చటఁ ॥గనుగొ॥
ఈ తియ్యమామిడి - లేఁతకొమ్మలనడుమ - ఖ్యాతిగానివసిం
చియుఁ - జేతమురంజిల్లఁజేరువపండ్లుతిన - చేఁత నైనవఱకుఁ -
జించి ముక్కునయెంతో - ప్రీఁతిచే రసవిసరమానితుఁ - బ్రేయ
సికి సమకూర్చు - నీశుక - జాతివారలఁ బ్రేమలెల్లను - సరవి
జూడుము కనులకింపుగఁ ॥గనుగొను॥
ఇలను గోమటిసేని- కులజుఁడై సకలార్థి - ఫలదుఁడౌ వీరయ్యకుఁ
గలుములొసఁగిన కొత్త-పలి రాఘవునితోడీ - స్థలమేడజూడిన
దంపతులమతుమయ్యె - సలలితంబుగ నిందుమనమా - సలిల
జాకరమునకుఁ జనిజల - ములను గ్రోలియుఁదిరిగి పురివర-మునకు
జనవలె నీక్షణంబె ॥కనుఁగొను॥

వ॥ ఇట్లు వనప్రభావము దండధరునకుఁ జూపి చెప్పుచు హేమాంగ
దుండు జలంబుఁగ్రోలుటకుఁ గొలనుకుఁబోవుచు మరలనిట్లనియె.

సీ॥ నాముక్కు రంగుఁ బూ♦నఁగనేలనని కత్తు
గలిగి దాడిమపండ్లు ♦ చిలుకజీఱ
నానల్పునీడలఁ♦బూను టేలని కోప
మంది కోయిలమావి ♦ యందుఁగూసె
మాకుంభముల కుప ♦ మానమేలని కరు
ల్పంతమున వెలగ ♦ పండ్లు మ్రింగె
నాచల్లఁదనమూన ♦ నాయమాయని చలి
గాలియరంటుచుఁ♦గలఁచుచుండె
తే॥గీ॥ మాశరీరంపుకాంతులు ♦ మఱితరంగ
ములనునుంచఁగనేలని ♦ కలహమాచ
రించ నీకొలఁకులనుండె ♦ నంచలెల్ల
చేరిగను దండధర వన ♦ చిత్రమెల్ల.

వ॥ అని హేమాంగదుండు దండధర సమన్వితుండై తత్సమీపంబున నున్న పొన్నగున్నక్రిందఁ గూర్చున్నఁ దదంతికంబుననున్న ధర్మ ధ్వజుని పౌరోహితులు ఆరాజశిఖామణినిఁ జూచి వర్ణింపఁ దొణంగి రెట్లనిన

దర్వు—ముఖారిరాగం—ఆటతాళం

ఏరాజసుతుఁడో - యీవనములో - నెందుకున్నాఁడో - మారుఁడో సురపకు - మారుఁడో లేకులరంభా - జారుఁడో పృథు చక్ర - ధారుఁడో గాకున్న - నేరసాధిపసుతున కింతటి - చారు సుందరముండు నేమన - కోఁకలు ఫలియించెఁదగుజా కోమలికి యీవన్నె కానికి ॥ ఏరాజ॥

వనజారిఁ గేరు - ముద్దులుఁగులుకు - వదనంబు సౌరు - కనులు కల్వలనేలు - తనువు బంగరుడాలు - పెనుబొమలు పదోకండు- పెదవి దొండపండు - ఘనతరంబగుఁ గురులతుందము - ఖంజరీ టపుగుంపుచందం - బనుపమంబగు చెక్కుటద్దము - లద్దముల గమితళుకు నిద్దము । ఏరాజ ।

విలసిల్లుచుండు - కోమటి నేని-వీరతుకుమెంపు- కలుము లొసఁగిన కొత్త - పలిరాఘవునిచిత్త - జలజాతముల దలఁచి - నరగముం గిటనిలఁచి - చెలువమగు నీపటమువాని- చేఁతికిచ్చినతోషమూని నిలువకను మనవెంటవచ్చున - నేలజేఁడిఁక మనలమెచ్చును - ॥ ఏరాజసు ॥

వ॥ ఇవ్విధంబున యారాజశేఖరు రూపలావణ్యంబున కచ్చెరువొంది విప్రోత్తములు తిన్నతిన్నగాఁ సమీపంబునకువచ్చిన

చ॥ కనుఁగొని నేలవేల్పులను ♦ గ్రక్కున లేచి నృపోత్తముండు వం దనములు జేసివారిపద ♦ తామరసంబుల కర్ఘ్యపాద్యపూ జనయము మీరఁ జేసితన ♦ సన్నిధిపీఠము లందుఁ జేర్చి మే ఘనినదసన్నిభంబులగు ♦ కమ్రపుమాటల తోడసట్లనుఁ.

మ॥ ధరణీదేవతులార మీనగరమే ॥ తట్టుండు మీరాజ్యమే
నరనాథుండుభరించి ప్రోచుఁదమకే ॥ నామంబు లింపొందు నెం
దరుపుత్రుల్సుత లెంతమంది యటే వేదంబెంతసాధించి నా
రరయేమాత్రిములేక దెల్పినను క ॥ ర్ణానందునిన్జేయుఁడీ.

దర్వు — కమాచిరాగం- ఆటతాళం

వినుమున్నృపవర నాగపురియూ - మనికిపట్టానిత్యము - ఘనుఁడుధర్మ
ధ్వజుఁడు మాభూ - మిని భరించుట సత్యము ॥ వినుము ॥
కొండబొట్లని నన్ను నాతని - తిండిబొట్లని పిలుతురు - పండుగలు
పబ్బంబులై తే - పౌరుజనములు - గొలుతురు - ॥వినుము ॥
నాకునల్వురు సుతలు - ముగ్వురు నందనులు గలరింపుగా - కూక
లేటికి నితనికొక్క తె-కూఁతురయ్యతలంపఁగా - ॥వినుము॥
వేదశాస్త్రపురాణములకో-విదులమందరిలోపల మేదినీశ్వరు మన్న
నలచే-మెలఁగుదుము భువిలోపల - ॥వినుము॥
ధరణిలోపల కొత్త పల్లిపురి-ధాముడై యశాంతము-కరముకో నుటి
నేనివీరయాఁ-గాచు రాఘవు నెంతు ను - ॥వినుము॥

కం॥ అనిబకుచు భూనాధున
కును తనుచేనున్నపటము ॥ కుతుకంబలరం
గనుఁగొనఁగి మందహాసా
ననులై ద్విజులూరకున్న ॥ నరపతివేడ్కన్.

వ॥ పటంబుఁజూచి ఆహా! ఈముద్దులాడియొద్దఁజేరి ముద్దుఁగొనని నాజ
న్మంబు గాల్చనా అని మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలిసి పటంబుఁ జేతఁ
బట్టుకొని వర్ణింపఁదొణంగె.

దర్వు—తోడిరాగం—అటతాళం.

కులుకుఁబాయఁపు రాచచిన్నది-దీనిఁ గలసిన బహు సౌఖ్యమున్నది
కలువరాయునిఁగేరు కలికిమోముసారు-తళుకుచెక్కులతీరుఁ-దలఁ
పముద్దు గారు - ॥కులుకు॥

చిక్కిలిజేసిన మరునిబాణకు - వేల్పు - చేడెలకుఁగలదె యీసొగసు - వికచ కుందములంద - మకలంకరదబృంద - మొకటి నాసటిచంద - మురుతర కచకంద - ॥కులుకు॥

దిద్దిన శ్రీలోనుకృతులు - దీని - ముద్దుబెట్టనివానిగతులు - కొద్దివెపాలిండ్లు - కుదురైనపూఁచెండ్లు - బొద్దుచేతులుతూండ్లు - బొమలంగజునివిండ్లు - ॥కులుకు॥

కోమటినేని వీరయను బోచు - కొత్తపల్లీశునిదయను - ఈమగువనను బొందితే మరునియిబ్బంది - లోముసుఁగభృతిఁజెంది - నేమనుదు సుఖమంది ॥కులుకు॥

వ॥ అని వర్ణించి ఈ వ్రజంపుతునక పొందుఁగొనక దీని పురంబునకు జనక వెనుకముందు జూచువాఁడన అని భూసురోత్తములఁ జూచి పటంబుఁజూపుచు నిట్లనియె.

కందార్థము — రాగం — శంకరాభరణము — అటతాళం

లలిభూసురవరులార - తలఁపున మిము మఱువనెపుడు - దయచేతను నీనలినాక్షినామమెయ్యది - తలిదండ్రులపేరులేమి - స్థలమేపురమందు - సంగతులన్ని - దెలిపినవిందుఁ - దలఁపోసికూడ నిం - తటిమటుకు పరిణయముఁ - దలఁపెట్టనట్టుగాఁ - దరుణిపటముఁ దోఁచెఁ - జెలికిఁ దగుజోడు - రాజెవఁడైన - గలుఁగఁజాలఁడు॥

వ॥ అనిన నవవిల్తు మినుకుటమ్ములకు మనమ్మున ఘనమ్మగు వనటఁ బొంది ఆచక్కెరబొమ్మ చక్కఁదనంబునకు నక్కజమ్మగు మక్కువచేఁ జిక్కుపెటింగి భూసురోత్తములు హేమాంగద భూమీశునితో నిట్లనిరి.

కందార్థము — రాగం — శంకరాభరణము

నరనాథోత్తమవినుమీ - తరుణీమణిఁగన్నతండ్రి - ధర్మధ్వజభూ -

వరుఁడీమె కామమంజరి- నరనుతమగు కాపురము శ్రీ - నాగపుర
వరము - స్వర్గముకంటె భోగము కరము॥
ఈ గజగామినికి - యీడయినపతిలేక - నేగదపెండిలి - నిలు
చుట యిదివరకు - నాగారిశౌర్య - సజ్జనవర్య - ప్రాగద్రి
ధైర్య॥

వ॥ రాజా ఈమీానన్నేత సుచరితము చిత్రగతుల మీాశ్రోత్రంబు లానం
దింప సంగతులెల్ల మంగళాస్పదంబులగు శృంగారాది వాక్యంబులఁ
ప్రసంగంబుఁజేసి మీాసంగతులు విచారించెదము.

సీసార్థము

తెలుపు బేడసబెళ్కు ♦ పెద్దకన్నులతళ్కు ♦ సన్నవికానెన్న మిన్ను
దన్ను | ముక్కు సంపఁగిపువ్వు ♦ మోవిబింబమునవ్వుఁ చక్కని మెయి
మించు ♦ ధిక్కరించు | నారుచీమలబారు ♦ పేరుముద్దులుగారు ♦
ఘనముసంగనునొప్పుఁ గప్పుకొప్పు॥

చక్కని మెయికావి♦సరసిజసుమతీవి-గఁలుగు నీరాజకులకాంత♦ తుల
రారురంభా-దులుచక్కఁదనముకిసుమంత♦అలరువిల్తునిరతిని-నలునిదమ
యింతినిముందు ♦ నలువనిర్మించి యుంచు-వలనఁ జేయుళుకుఁదీరి ♦ తలఁ
పునఁ దాలిమి జెంది ♦ బలు-నేర్పలవడముద మెదఁబొంది -చెలఁగునిన్ను
యీాకలికిని పేమలు ♦ గలదంపతులనుఁ - గాఁజేసెనోభువి ♦ వలనొప్ప
రాజకులిభూమ ♦ కమనీయ వేష ♦ ఖలశత్రు తిమిరనవపూష॥

వ॥ రాజో త్తమ నిగనిగలాడు నగుమొగము తొగలతాయనితోఁ
బగబూనఁగల ఈమగువసొగసుఁ జెప్పనేల నటునుండ నిక్కాము కాం
తాబలామ వయోవంతు రాలుగాగ మాధర్మధ్వజ మహారాజీమె
కనుపైన రూపవంతుడైన రాజకుమారునిన్నానక ఈరూపంబీపటం
బందుఁజేర్చి మమ్ముఁబిలుపించి మాచేతికీపటంబిచ్చి మీరు సకల
రాష్ట్రంబులఁదిరిగితగిన రాకుమారుని వెదకిమీా వెంటనీతుణ మేతిసికొని

రావలసినదని మమ్ములఁబంపె. మేముబయలుదేరి ఇమ్మహీమండలం
బెల్లఁ ద్రిమ్మరిద్రిమ్మరపోయి ఈచక్కరబొమ్మకుఁదగిన యెమ్మెకానిని
గానక ఈఁపూఁదోఁటఁజేరి దరిదోచక పరితపించుమాకు నొక బం
గారుకొండవలె తమరుగనుపించితిరి. అంతమేము సంతసించితిమి.

## సీ సా ర్ధ ము.

గనుక మీవంశంబు ♦ గ్రామంబు నామంబుఁ ♦ దెలియఁజెప్పియుఁ
బయల్దేరిమీఱు । మా వెంటఁజనుదెంచి ♦ మామాటదక్కించి ♦ యీ
హేమగాత్ర ♦ వివాహమాడి । ధర్మధ్వజుండిచ్చు దంతావళంబులు-
కదురథంబులు హరు ♦ లక్కల్పలంబు ♦ లును రత్నహారము ♦ లకనక
భూషణములు ♦ ఘనవస్త్రచయములాదిగఁ ♦ గలకానుకలువేడ్కను
జెంది పొందిపోదిగ ♦ దినమణి కిరణములు బా ♦ రని పూలతోఁ
టలోనీ ♦ కనకాంగినీవు నిరతం ♦ బును సంచరించియెంతో ♦మనము
లలర పూలుమరిగో ♦ సినముదంబెచాలు ♦ తనివిదీర దాస్థలమహి
మలుజె ♦ ప్పినమీకేమని వినుపించెదమిఁక ♦ వినుము కందర్ప సమ
రూప మామాటలరలేకనునమ్ము మదిని ధాత్రీప॥

వ॥ రాజవర్యా ఇదిమాసంగతి ఇఁకమీ స్తితి అమ్మలోపమానంబులగు-
వాక్యంబులఁ జక్కఁగా వక్కాణించి మాకర్ణములఁ దేనియతేట
నింపుమనిన భూసురోత్తములతో హేమాంగదుండిట్లనియె.

క॥ వనజారివంశసంభవుఁ
డిన తేజుండైన సింహ ♦ ళేశ్వరునకు నం
దనుఁడను హేమాంగద రా
జను నామముఁగల్గువాఁడ♦నవనీస్థలిలో.

వ॥ అయ్యలార నాస్థితియిట్టిది. ఇదియునుంగాక మఱియొకటిఁజెప్పెద.

దర్వు—ముఖారిరాగం—అటతాళం

వచ్చేదనయ్యా మీావెనువెంట వచ్చేదనయ్యా వచ్చేదనయ్యా
యీా వెన్నెలాడినిఁగలసి ముచ్చటలాడినా మోజుదీర్చుకొనఁగ ॥వ॥
ఎన్నఁడుజూతు నారమణి పొందెన్నఁడుజేతు తిన్నాగకెమ్మోవి తేనె
గుక్కలుబట్టి యెన్నఁడు మ్రింగ నా యిష్టమిాడేరునో ॥వ॥
నిక్కంబుగాను దానిదియీా పాన్పెక్కియు నేను చెక్కిళ్ళునంట
చురక్కున నొక్కినా మక్కువదీరనెక నక్కముులాడఁగ ॥వ॥
కోమటినేని వీరయనేలి కొత్తపలి బూని ప్రేమతో బ్రోచిన రామ
నామముమదిని నీమముచేఁ బ్రమ్మి యీామగువదరిజేర ॥వ॥

హేమాంగదుఁడు తన వేత్రపాణినిఁజూచి యిట్లనియె

కందార్థము

విన కోరి వేత్రపాణి ♦ మనపురమునకరిగి
యిట్టిమర్మంబెవరు ♦ న్వినకుండ
వింటనుండుము ♦పనిఁబడి యీాద్విజులవెంటఁ
బోయెద మరుభాధలెక్కఁ ♦ జేయకఁ
బోయెదనే ♦ పొలతినిఁగైకొని
యోయుపమునసై ♦ నాయరుదెంచెదఁ
బోయెద మరుఁబాధలెక్కఁ ♦ జేయక

వ॥ దండధరా పోయివచ్చెద

మ॥ అని హేమాంగదరాజు భూమిసురల ♦ స్వారంబుతోఁగూడి దో
వనునానావిధ పర్వతంబులఁబురీ ♦ వ్రాతంబులనాల్వాలన్
మునివాసంబులఁ జెంచుపల్లెల మహా ♦ భూజంబులన్బత్తులన్
ఘనసింహంబుల వ్యాఘ్రసంఘములఁ ♦ జక్కన్జూచుచునోప్పుచున్

వ॥ ఇవ్విధంబున జనిచని నాగపురము చెంతఁజేరి తత్పురప్రభావంబు
హేమాంగదుండు వర్ణించె నెట్లనిన

దరువు—నాటరాగము—అటతాళం

ఈపురము గోపురము రాపాడునుసరి రాఁదగదనుచును గోపురంబు
లల కోటగోడలెంతో పొడవైదివి తో నొఱయును భళి ॥ఈ॥
కాంతులతో యింతులతో - సంతసమును భూ - కాంతులలరుమరు
వంతుకెక్కు సౌ - దాంతంబుల నిను - పంతింతన శేషాహికిఁ
దరమా ॥ఈ॥
దొరువులతోఁ - దరువులతో - విరితోఁటల సంభరితమౌచును -
ధరలో రెండవ - ధనదుపురంబని - సరవినిఁజెప్పను - సంశయ
ముండునె ॥ఈ॥
రాజులును - వాజులును - బాజారుల సం - బరపు రవములును-
తేజమలరనీ - తీరుపట్టణం - బేజగముల యెందెచ్చటఁజూడము॥
క్షేమముగా - నీమముగాఁ - గోమటినేని సు - కులుఁడగువీరయ
నాముని బ్రోచిన - భూమిఁగొత్తపలి - రాముని దలఁచుచు -
రాజెవండేలునో ॥ఈ॥

వ॥ ఇట్లు తత్పుర ప్రభావంబున కచ్చెరువొంది ముచ్చటించు నాహే
మాంగదునిఁజూచి బ్రాహ్మణులు రాజా ఇదియే మాధర్మధ్వజ
మహారాజుగారి పురమని వెంటబెట్టుకొని భూసురోత్తములు

పంచపాది మత్తేభము

చని ధర్మధ్వజు మ్రోలనిల్పి కృప భూ ♦ చక్రంబునందంతట
న్దనరు న్రాజకుమారులన్గనిన నే ♦ త్ర ప్రీతియున్మాకు గా
కనుదేశంబులనెల్లఁ ద్రిమ్మరియుఁ బ ♦ ల్కట్టంబులన్గాంది యీ
ఘనుని న్నూతనవీన మన్మథుని భూ ♦ కాంతాత్మజుంజూచి యీ
యనకీ బంగరుబొమ్మ కందగిన జో ♦ డంచు న్నయంబారఁగ

కం॥ కొనివచ్చినారమవనీ
శవయాన్విత చిత్తుఁడితని ♦ జామామణి గాఁ

దనరిన నీసుతతోలి నో
చిననోములు సార్థకంబుఁ జెందక యున్నె

వ॥ అనిదెలిపిన భూసురుల వాక్యంబులకు అంతులేని సంతోషితస్వాంతుఁడై భూకాంతుండు హేమాంగదునిజూచి యాతని చక్కదనంబునకెక్కువ మక్కువఁజెంది నిక్కంబుగా జొక్కపుబంగరుధిక్కరించు తనూలతయగు తనూజాతనిచ్చి వివాహంబుఁ జేయనిచ్చఁగల్గి అచ్చటి జ్యోతిశ్శాస్త్రకోవిదులచేఁ బేరుఫలంబులు తారాచంద్రఫలంబులు జూపించి శుభలగ్నమందు ముందుగానల్లునకు మధుపర్కంబొసంగి పెండ్లిజేయప్రారంభించె నెట్లనిన

దరువు—ముఖారిరాగం—ఆదితాళం

పెండ్లిఁ జేయఁగఁబూనిరపుడు - హేమాంగదునకును - పెండ్లిఁ జేయఁగఁబూనిరపుడు - పెద్దిదంపతులఁ బీటలజేర్చియుఁ పండ్లు కానుకలుబాగాలిడియా - పెండ్లికివచ్చిన - పేరటాండ్రు పూఁ-చెండ్లఁబోలు - పాలిండ్లుఁగదలమే - ల్గిండ్లనన్నలు - గిడిపాడఁగమ ద్దెండ్లనిసదములు - దిక్కుల్మ్రోయఁగఁ - బిండ్లుగట్టియును- వేశ్యాంగనలల - కొండ్లిసలుపఁగాఁ - గుతుకముతోడను ॥పెం॥
భళిభళియనుచును - భట్రాజులు బిరు - దులుపఠింప బం-దుగులు ధారుణీ - తలనాధులు ర - త్నములు ముత్యములు - గల పళ్లెంబులఁగానుక లివ్వఁగ - వలగొని బ్రాహ్మణ - వరులు వేదములు కలయఁజదివి య - క్షతలుజల్లనుం - గళమసి పుణ్యాం - గనలు గూడి పా - టలుపాడంగను -తులరహితంబుగ ॥పెం॥
రాఘుడోల్లు బూ - రగలు వీణియలు - సీను మేళములు చిటితాళంబులు - భూమియుఁగగనము - భోరుకలుఁగనా - నీమహిఁబోత్త పలీశ్వరుఁడై మతి - కోమటిసేని సు - కులుఁడగు వీరయ - నామునిఁబ్రోచిన - రాముఁనిదలఁచుచు - కామమంజరీ గళమునఁ దాళి - హేమాంగద భూ - విభుఁడు గట్టఁగ ॥పెం॥

వ॥ ఇవ్విధంబున పౌరోహిత రచనార్హ్రితనిర్గత వేదహిత మంత్రాశీ ర్వాద ప్రకారంబున అయిదుదినంబులు వివాహంబు సక్రమంబుగా జరిపి తత్పరిణయోత్సావ వీక్షణానక్తసమాగత భట్టు బ్రాహ్మణ ప్రముఖార్థిజనంబుల నిష్టమృష్టాన్న సముర్థులఁజేసి వారుగోరబడిన బహుమతులొసంగి తదనంతరంబున-

ద్వి॥ మనునిభుఁడైన ధర్మధ్వజభూపుఁ
డనువొందువట్టి కన్యాదానవేళ
భూరి ముక్తాహార ములురథహస్తి
చారుతురగపాద చారులవిమల
కనకమయంబైన కలశజాలంబు
లనుపమచీని చీనాంబరసంఘ
ములుదాసదాసీలు మొదలుగాఁగలుగు
కలకానుకలుప్రీతి కలితాత్ముఁడైన
అల్లునకొసఁగి ప్రఖ్యాతిగానపుడు
తల్లితే వెమ్మని తనబిడ్డచెయ్యి
బట్టి హేమాంగద వసుధేసుచేత
బెట్టి కన్నీరొల్క పృథ్వీశ్వరుండు
వలనుమీరఁగఁగొత్త పలివానుఁడైన
అలరాఘవునినమ్మి యపుడిట్లుపల్కె

దర్వు - మధ్యమావతి రాగం - అటతాళం

హేమాంగదనృప నామనవివినుమా తమానవతి యిన్మమెత్తిన దాదిగ ప్రేమమీరఁగ చంద్రశాలలలో మెలంగుటెకాని యెన్నఁడు భూమిపై నడుగిడనెఱుంగని కోమలాంగిసుమీ నిజంబుగ ॥హేమాం॥
తలఁచిచూడ చిన్నతనమునుండి చెలఁగి తను పోషించుచిలుకలతోఁ బలుమారు పలుకుచు మఱియొకటిదప్పగఁ జెలులు కోపము జేసి పిలచినఁ బలుకనేరము నేనుబిలచినఁ బలుకకెప్పటికైనగాని ॥హేమాం॥

చిన్ననాటనుండి-యెన్నటికైనఁ-గన్నతలిదండ్రులనుఁ-గాని దేవునిగాని తిన్నగా సేవింపనెఱుఁగని-నన్ను తాంగిని భార్యగాఁ గై-కొన్నవాఁడవుగాన దయలే-కున్నఁ బ్రతుకుట దుర్లభంబౌ ॥హేమాం॥

సరసుఁడవనుచు నీ-పరసిజముఖని-పరిణయము జేసి యీబరువు నీతలఁ బెడితి-ధరణిఁ గోమటి నేనివీరతు-వరదుఁడౌ శ్రీగొత్తపలి రఘు వరునిఁదలఁచుచుఁ బ్రోవుమెప్పుడు-వదలకను సుఖవర్తివగుచును ॥హే॥

వ॥ ఇవ్విధంబున ధర్మధ్వజుండు కూఁతురుని యల్లునకొప్పగించి యిట్లనియె

క॥ హేమాంగద భూమీశ్వర
యీ మణిమయమందిరమున ♦ నెల్లప్పుడు నీ
భామామణితోఁ గలసియు
క్షేమంబుగనుంటి వేని ♦ చిత్తము మెచ్చున్.

వ॥ అనిన హేమాంగదుండిష్టపది నాగపురంబున నుండెనంత

ఉ॥ అంగుగఁ గామమంజరి ప్ర ♦ హర్షముఁ జెందుచు నొక్కరేయి హే
మాంగదరాజుఁ జేర మణి ♦ మండితమైన సమస్తభూషణా
లింగిత గాత్రవల్లికయి ♦ లేనగవొప్పు ముఖంబుతోడ సా
రంగ సమానయానమున ♦ రమ్యముగాఁజనుదెంచి యిట్లనున్

దరువు-తోడిరాగం-రూపకంతాళం

ప్రాణనాయక - యీ-పానుపుపైనను - సానందముఁగను -
ప్రాణ - సూనశరసమానరూప -॥ సోమసదృశవదనదీప - జ్ఞాన విజితశారదాప - మానసభవ-మానకన - న్మానింపుమునను॥ప్రా॥
నిన్ను నమ్మితి - నీ-కన్న దైవమెవరున్నవారు మఱి - మున్ను నేనుఁ జేయుఁదపము - లెన్న సఫలమయ్యెనిజము - కన్నులనినుఁగాంచి సుఖము - గన్నందుకు - మన్నింపుము - సన్నుతాంగనా ॥ప్రా॥
నెమ్ము ప్రేమతో - నీ - సొమ్ము నైతిఁ గైకొమ్మునన్ను నిక-గమ్మ

నైనమోవివావ - కమ్ముఁద్రావి కోర్కులీన - కమ్మవిల్తు కేళిఁబోన
సమ్మతిఁబడ-నెమ్మదిఁగా - నిమ్మకార్యమును ॥ప్రా॥
వినుముకోమటి-నేని - వీరయనేలిన - ఘనతగొత్తవలి - జనక
తనయావిభునిచింత - స్వాంతమందుమరువకింత - వినయగుణుడ
వైనసీకు - వనితనుగాఁ - దనరుటచే - తనుముదమొందితి ॥ప్రా॥

వ॥ ఇట్లు కామమంజరి ప్రేమాస్పదంబులగు వాక్యంబులుచ్చరించిన హేమాంగదుండు సంతుష్టాంతరంగుడై

కం॥ సిరియును వెన్నుఁడు భాషా
తరుణియుఁ జలజాసనుండు ♦ దాక్షాయణియు
న్హరుఁడాల్మగలగురీతిని ♦
తరుణీపతిఁ సౌఖ్యపడుచుఁ ♦ దగనుండిరిలన్

వ॥ ఇవ్విధంబునఁ గొంతకాలం బత్యానందచిత్తుండై హేమాంగదుండు యొకానొక సమయంబునం దనవారిజూచుఁ వేడుక మనంబునంబ్రొ దమి పోవ నుద్యోగించినచందం బాలేమ ఱుఁజింగి తేనెలొలుకు పలుకులతో భర్తనుగాంచి.

కందార్థము—శంకరాభరణము రాగం.

వింతగ హేమాంగద భూ-కాంతుడ తలిదండ్రులాది-గాఁగలవారిం
స్వాంతంబందునఁ దలచుచుఁ - జింతిల్లెద విదియునీకుఁ - జెన్నాగు
నయ్యా-నామాటలు-విన్న మేలయ్యా-కన్నులారఁగ పన్నుఁ-గన్గొని
నీకిష్ట-మున్నరీతినిమెలఁగు-చున్ననీకేమైన-మన్నానఁగొఱఁత-జేయు
దునయ్యా-మహానీయచరిత॥

ఉ॥ పొంకమలర్చు నీమొగము ♦ పోలికఁజూచిన నీదుచెయ్యులన్
గొంకకఁగాంచినన్మిగుల ♦ క్రొత్తగ సంశయమేర్పడెన్నిరా
తంకతదాల్లి నేస్తమగు ♦ తామరసాక్షి యొకర్తురమ్మన
న్బికముతోడఁ బోవగను ♦ మీయని మామక మానసంబునన్

వ॥ అనిన హేమాంగదుండిట్లనియె.

కం॥ నీమర్యాదకు లోపం
బేమాత్రములేదు ధారిణీ ♦ శుని కంపటం
బేమియులేఁ దస్మన్మన
మేమగువను గోరదింత ♦ యేమిటికన్నా॥

దర్వు—బేహాగ్ రాగం—తాళం అట.

వినుముకాంత-నా-వృత్తాంతమంత-మనము పరిపరివిధములను వెత
లనుభవింపుచునున్నది ॥వినుముకాంత॥
తనదుపొత్తు-బా-యుని నన్ను నెత్తు-కొని చరించెడి తండ్రి యెంతటి
వనటజెందుచునుండెనో ॥వినుము॥
ఎపుడే గాని-నే-నింటిగో లేని-యపుడు కన్నులుబోవునను మా
యమ్మ యెంతికృసించునో ॥వినుము॥
వినయగతిని-నా-మనసుసంగతిని-గని చరించెడి మిత్రులెంతటి
ఘనతచింతవహించిరో ॥వినుము॥
పనులుజెప్ప-నా-యను మతినిద ప్ప-కను మెలంగెడుమనుజులే చీ
కాకుజెందుచునుండిరో ॥వినుము॥
మారసముని-కో-మటి నేనికులుని-వీరయనురక్షించుకొత్తప
లీరఘూత్తముఁ దలఁచుచు ॥వినుము॥

చ॥ అనవిని కామమంజరి జ ♦ నాధిపసూనుని జూచి పల్కెనో
యనఘచరిత్ర దీనికి మ ♦ హాకులత వ్వహియింపనేల మా
జనకునిఁ గానకుండనొక ♦ సైంధవరాజము నెక్కి- జేయివే
శను మనదేశముస్గన వి♦ లాసముగాఁ జననొప్పునెంతయు॥

వ॥ ప్రాణేశ్వరా మాజనకునకీసంగతి వినఁబడిన మనప్రయాణమునకు
భంగముఁగల్గుటయే నిశ్చయంబని వెండియు కామమంజరియిట్లనియె

ద్వి॥ వినుము ప్రాణేశ్వర ♦ విశదంబుగాను
ఇనుడస్తగిరిజేరి ♦ యిరులన్నికడల
గప్పనప్పుడులేచి ♦ కనకాంబరములు
గొప్పభూషణములు ♦ కోరినకొల్లఁది
రూపికల్లాని బరు ♦ ల్లూఢిగాఁజేరి
మీపురిజేరుట ♦ మేలని చెప్పి
ఆరేయి రెండవ ♦ ఝామంబునందుఁ
గారుచీఁకటి దిశల్ ♦ గప్పియేమైన
గానరాకున్నట్టి ♦ కాలంబునందు
మానినీమణి కామ ♦ మంజరియొక్క-
సాహిణిఁబిలపించి ♦ సాహిణమునకు
సాహసంబునఁబోయి ♦ సన్నద్ధబాణ
ధనువైన యిం్ద్రాయు ♦ ధంబను తురగ
మును దెమ్మటమ్మన ♦ ముదమునవాఁడు
చనుదెంచి యశ్వశా ♦ లాశ్వము దెచ్చి
కొనుమనియిచ్చిన ♦ కుతుకంబుఁజెంది
దానిపై సతిపతు ♦ ల్దగనెక్కి సకల
మానవుల్ నిదురమై ♦ మఱచియుండ
పురినిర్గమించి తెం ♦ పున కొత్తపల్లి
వరరాఘవునినమ్మి ♦ పైనమైయపుడు.

దర్వు—కమాచిరాగం—ఆదితాళం

వెడలిరి దంపతు - లడలొందకనా - నడుచేయిని సం - తసమును
జెందుచు - ననకభారమున - బుడబుడ నుఱుపులు - వెడలఁగనూ
బడలఁగనూ - వడిగుఱ్ఱంబును - విడువకఁ దరుముచు ॥వెడలి॥
కఱచెడుపాముసఁ - బఱచెడుదర్యము - నెఱుఁగక నిర్ఝలప్రాద
యములు వగుచును - తఱచగునడవులు - దాటుచుఁ బిరబిరఁ -

ఇదియుగాక నుగ్గుకుముసు ధన-మెంతోవలపినమాత్రము-చాలకుగ
నడుతేయువీసుక- కదలుటెంత విధి తమ ॥స॥
పోవఁదలఁచిన మనము బంపఁగ-బోవద కదేయాదికీ-నీవు నేనలఁగూడి
శ్రీఘము- నేఁడు బొమ్మికఁ బోరికి ॥స॥
భూమిఁ గోమటి నేనివీరయ-నాముననిక ముఁ బోచిన- క్షేమకరమగు
కొత్తపలివురి- రాముమదిలోఁదలచిన ॥స॥

వ॥ నీతిధ్వజ యీనీతిపరుఁడైన యాభూతలనేత సూతుని సేతలు నీచేతం బునకే తీరుదోచుచున్నయవి మంచిదికాని యీ మానవాధముని ప్రాణంబులు కీనాశునకుఁదానంబుఁ జేయక ప్రాణంబులతో యుద్ధంబునబద్ధునిం జేసి ధర్మపద్ధతిబుద్ధులఁగరపిపంపుట ప్రసిద్ధముగదా గాన యీాత్మణమే లెమ్ము పొమ్ము పట్టుకరమ్ము అనిన నీతిధ్వజుండు బయలుదేరెనెట్లనిన

## దర్వు—ఆరభిరాగము—తాళంఆది

దండనాయకుఁడు వెడలెనపుడు-నీతిధ్వజుఁడనియెడు- దండనాయ కుఁడు వెడలెనపుడు-దండనాయకుఁడు వెడలె-భండానమాచరింపఁగ-
దండిరథములుతనతోఁ- దాడిన నడుచుచుండఁగ -తెండువైపులఁదు
పరిజనులుంచి ముదముజెంద-చుండఁగ- దండధరులుముందు- భీకర
భండన భువిరిపు- ఖండనయనుచును- మెండుపరాకులు- మెప్పుగఁ
దెలుపఁగ ॥దం॥

వందిజనములు బొగడుచుండ సామంతరాజు లెందరో తనను
గొల్చుచుండ-సుందరమైన తనదు-స్యందన హయఖురాగ్రములంధు
నెగసిన ఘనధూ-ళ్యాకాశమంటి లోకము- క్రిందుమీఁదుఁజేయ-
సరసిజ- బంధుకాంతిమాయఁ-దిక్కుల-యందు చీకటులుగాయ-
మటిమటి- మందుగుండ్లు పా-మానుబండ్లతో- గందరగోళము-
గావేవేగ మె ॥దం॥

కోమటినేని వీరయ నేలు- శ్రీకొత్తపల్లి రఘు-రాముని నమ్మిపడి మీసాలు- దీమసము ప్పతిల్ల- దీటు నెఱెవు కైపులు- సాము జేయుచు వచ్చు-నరదార్ల జూచి మెచ్చుచు- మోము నంజిరునవ్వులయు పన్నని-నామము నుదుటను వెలయ- దండను- ప్రేమగ జూచునుకలయ రిపులకు- భీమంబగురణ-భేరులు మ్రోయగ- హేమాగందభూ-మీశునిc బట్టను ॥దం॥

అటుల నీలిధ్వజుండు చతురంగబలసమేతుండై హేమాంగదుండు వోయినదారిబట్టి కూడముట్టెన.

ద్వి॥ అటుల నీలిధ్వజుం ♦ డలసేనతోడ
మటుమాయముగవచ్చు ♦ మార్గంబుc గాను
మంజరి జూచియా ♦ మార్గంబునందు
రంజిల్లు కేతన ♦ రాజివీక్షించి
నిరుపమాభీలమా ♦ వినదమాలించి
స్థిరముగా c దనతండ్రి ♦ సేనగానెంచి
పతినిద్ర కిసుమంత ♦ భంగమైన
నతుక నివ్వకమతి ♦ యుతనిశిరమున
కుపధానముగనొక్క ♦ నురువరిధాన
మవును జుట్టియు c బెట్టి ♦ యుభుకింత లేత
తలచీర కొంగు సి ♦ ద్ధము జేసి కొనియు
కలహకౌతూహల ♦ కలితాంతరంగ
అగుచు స ♦ న్నద్ధ సర్వాయుధంబైన
నగహ రాయుధ మెక్కి ♦ నాధునిచరణ
స్మరణ పరిణతహృ ♦ త్సరసీజయాట
ఖరజన్య మొక తృణ ♦ కణముగానెంచి
పటువిటపికి సమీ ♦ పంబుగావచ్చు
పటుతర సేనలో ♦ పలికి గుఱ్ఱమును
పరుగు c దోలించెను ♦ వరకొత్తపల్లి

ధరణీసుతాధీశుఁ ♦ దలఁపులోనమ్మి॥

దరు—జంఝూటిరాగము—రూపకతాళం

కలహమాచరింపఁబూని-కామమంజరీ-బలుల రథికవరుఁలఁబట్టి
తలలవనీ-తలముఁదాకో-బలితునుచుమ-బలిజేయుచుఁ ॥కలహ॥
కొండలౌనటంచుఁ-జూపర-సింధుజాధిపు మెచ్చెడి-దండిమావటీలు
గలవే-దండంబుల-తొండంబుల తండంబుల-ఖండింపుచు ॥కలహ॥
తురగములను-కౌతుకమిని-దోర్బలంబు పెంపునఁ-దరిమి నరికి వైవ
సాగెఁ-గరములుకం-ధరములు పెన్న-రములు వే-ధరరాలఁగ॥కలహ॥
పాదచారుల మెడలుబట్టి-వంగబెట్టి-గదఁగొని- మోదుచుండ-మొత్తు
కొనుచు-నీదయమా-మీఁదనుమణి-లేదాయని-ఖేదింపఁగ॥కలహ॥
నెరయు కొత్తపల్లి కోమటి-నేని-వీరయాఖ్యుని-ధరనుఁడై నరామ
విభుని-స్మరియింపుచు - పరసేనల - శరములచే - హరియిం
పుచు ॥కలహ॥

మ॥ అరిసేనాంబుధిఁ బాడబాగ్నివతుగా ♦ నావహాతిఁగావించు దా
శరథిన్బోలి శరాళిముంచుఁదిశల ♦ సైన్యంబుఁబోనీక నా
గుర్గహిం జ్వాలెలికట్లలీల మతిపొం ♦ గున్మ్రాంచు మాన్యకియ
న్వారి మంథాననగంబుకీతిఁ గలచు ♦ న్నామాక్షి కౌర్యోన్నతిన్

చ॥ ఇటువలెఁ గామమంజరి యు ♦ హీనపరాక్రమ మొప్పఁ గన్నులన్
జిటచిట నిప్పుకల్గొరల౯ ♦ సేననణంచిన దండనాధుఁ డు
త్కటమగు కోపమూనుకొని ♦ గక్కున దానను రేగి తేన్ను జొ
బ్బిటులు ప్రసంగవాక్యముల ♦ వేమనుఁ బల్కఁదొణంగె నత్తరిన్.

దరు—సంవాదము—శంకరాభరణం—ఆటతాళం

ప॥ కొమ్మా యిదినీకుఁదగు నమ్మా-యిటుబోరాడఁగ - నమ్మతిగ
దంభ్రడినిను-రమ్మా నెనుసుమ్మా మంచి ॥కొ॥

కా॥ నీవుమంచివాఁడవయ్యా-నీలిధ్వజమాయలకు - భావమునఁ దంత్రి
యని-భావింతునే నీమాటకు ॥నీ॥

ప్ర॥ తల్లియుంత పంతమెదఁ-దాల్చితివి యేమనుమనె - పిల్లతనమూని
పెద్ద-యల్లరికి లోనాదువే ॥కా॥

కా॥ తేనికినిఁబుట్టితిని-తేనిఁజేఁబట్టితిని - మానుమన శౌర్యపటి -
మంబు రణరంగమున ॥నీ॥

ప్ర॥ రాజసుతఁనుచు గ-ర్వంబుఁదగునమ్మ రణ-రాజ నెదిరించినిల్వ
రాదు నీబోఁటులకు ॥కా॥

కా॥ సేనలనుగూడి నేఁడు-జిక్కవడినా చేతికిఁ బ్రాణభయమునవిట్లు-
బలికినను బోనిత్తునే ॥నీ॥

ప్ర॥ నీదుమగతనమునకు-నీలిధ్వజుఁడడలొందునె-పోదువులె హేమాం
గద-భూమీశునిఁగూడియిఁక ॥కా॥

కా॥ పోకుండఁగఁ డ్డపడి-పోరుమని ధర్మధ్వజ - భూకాంతునిఁదలఁచు
కొని-పోకార్చెద-నీకాయము ॥నీ॥

ప్ర॥ పోకార్చెదననుచుఁ పెద్ద-పోకిళ్లఁబోకుసుమి-చీకాకై పోయెదవు
నీకెంతకె మూర్ఖత్వము ॥కా॥

కా॥ వెలయుఁగోమటి నేని-వీర్యానఁ బ్రోచుగోత్త-పలి శ్రీరాముని
నమ్మి-కలన నిను-బలిజేసెద ॥నీ॥

సీసార్ధము.

నిర్భయచిత్తయై ♦ నిలచినకామమం ♦ జరిని నీలిధ్వజ♦సచివవరుఁడు ♦
గనిన్రామములన్ని ♦ కణము సరాలంగఁ♦ జటులకోపాన్విత ♦ స్వాంతు
డగుచుఁ ♦ బలికెనో భామనీ♦బాల్యంబునుండి నే ♦ నెత్తుకి ముద్దాడి ♦
పొత్తునందు ♦ నన్నంబుదనిపించి ♦ మన్నించినందుకుఁ ♦ బలుపెక్కి
నేఁడు నాతోడ ♦ కలహముజేయఁ ♦ దలఁచుట చిత్రమాఁజూడ ♦ వల
నొప్పఁబాలుబోసి ♦ పాముపిల్లానబెంచఁ ♦ జెలతో కఱువఁజూను ♦
సితియాయె వైతెమాన ♦ తలఁపున ధైర్యంబూని ♦ మదిలో ♦ నళు

కినుమంతయుమాని ♦ నిలచినసీబల ♦ చలములు భళిభళి ♦ భళియని వెయినో ♦ రులనుతిఁ జేసెదఁ ♦ దాలుగకనిల్వు పూబోణి ♦ నాశౌర్య ధైర్యం ♦ బులుజూడుకలన నలివేణి॥

వ॥ అనిన విని కామమంజరి సీతిధ్వజునితో నిట్లనియె

సీసార్ధము.

వినుముసీతిధ్వజ ♦ తనయింటిదీపమే ♦ యనుచుముద్దిడఁజూచు ♦ జనుని భంగి ♦ నేనెత్తి పెంచిన ♦ నెలతఁగదాయని ♦ చనవుగాఁదలఁచియా ♦ జన్మమందు ♦ ననునెమర్పుటఁజూడ ♦ ననుగినియుఁగాఁజేసి ♦ పొగలవే మల్లి ♦ నాగపురికి ♦ ధర్మధ్వజునిముఖ్య ♦ దండనాయకుఁడవై ♦ దారా పుత్రాదులందఱిని ♦ యెడబాసి స్వర్గపు ♦ దారినిబొమ్ము మిత్తిరిని ♦ ఘోరశరజాలముల నీ ♦ గుండెలు జీల్చిరక్తపు ♦ ధారాసంపాతమున రణ ♦ తల మెత్తమంటియులుకు ♦ తీరునలుకుఁబోసి ♦ మెదడున ♦ వార ముగ్గులేసి ♦ కోరుభూతముల ♦ కోట్లకుపండువు ♦ గారచియించెద కట్యాదీరసీ ♦ బీరములన్నినణగించి ♦ దనుమూడెదను నా ♦ చేసువ నిల్వు మెదురించి

వ॥ ఇట్లుబలుకు నా కుటిలాలకపెటుకు మాటలకు కటతటంబులదర నిటలతటంబు భృకుటి యొకటిగాఁ జటఁజట నగ్నికణంబులు కటకున రాల కోపారుణిత లోచనుండై సీతిధ్వజుఁడు కామమంజరినిఁ జూచి యిట్లనియె.

కందార్ధము.

వనజాక్షి యింతవరకును - ననునేలిన ధారణీశ - నందిని వనిలో - ననుమానించితి రణమున - నినుమార్కొననింకఁ జూడు - నేఁటికలహమున - నాసితశర - కోటివేగమునఁ - బాటించదిసీతనువు - బగలజీల్చియుఁ గొవ్వు - తేటగాఁగరిగించి దివిటీ లకునుబోసి - వాటముగవెలిగించి సీవిభుఁ - బాటనెదకియుఁ బట్ట

కన్నను - పోటుబంటు నేయుచును శరముల - నాటనేసియు నార్చె
వేలుపు - కూటువులు బెదర - దిగ్గజకర్ణ - కోటరములదర -

కందార్థము

ఏసినవినకుమనెనుని - మేసిగనుర్ధ్వజహయాళి - నిలఁగూల్చి
బలే - రోసమునరథముఁ బొడిపొడి - జేసియు సారథినిజంపి -
చెలఁగిపెల్లార్చి - నీతిధ్వజుని - కలహమునవోర్చి - పలికెనో
సచివభూ - తలనాయకుని సేవ - వలను ప్రాణములుండె - బలు
సాకుఁ దిని బ్రతుకఁ - గలవుగానిఁ - కరథము కొక్కెము - విలు
శరంబులు - హాసులు లేకను - కలన వన్నెదిరించి నిలుచుట - కల్ల
గాదెతెలంప జన్య - స్థలమువిడనాడి - వెన్నిచ్చిపో - చలము
విడనాడి॥

కందార్థము

ఈఁతీరుబల్కు పల్కులు - నీతిధ్వజుఁ గర్ణములకు - విసితాంబక
స - ఘాతము జొనిపిటులై - వీతరథుండైనఁగాని - భీతి
వణగించి - ఖడ్గముదూసి - చేత సవరించి - నాతికో నీశిర
ము - హేతిచేతఁదతో - ఛేదించెదను ఘోర - భూతములకిడి
మెచ్చఁ - జేతు మాంసపుఖండలెల్లను - జీలికలబడఁగోసి పై
కెగ - రేతుఁ బక్షులకు నా - బూతుఁదీరఁగ వనుమఁ
బలుకుమఁ - జేఁతిగొద్దిగను - వ్రేసెనునిసిత - హేతిచేఁ దెగను॥

౫॥ ఇట్లు నీతిధ్వజుండు ఖడ్గంబువైచిన గామమంజరి—

కందార్థము

విడచినఖడ్గంబొడుపునఁ - గుసిచేతనుబట్టి బాగ - గుట్టము
విసి తాఁ - బుడమిపైధుమికి యాతని - మెడఁబట్టుక వంగ
బెట్టి - మెలఁతచెయ్యెత్తి - శతశతమనఁగ - ఝళిపించి కత్తి -
నిలచి పలుకగఁ దొణగె - నీతిధ్వజుఁడ పెద్ద - పులినోటఁబడు

జింక-పోలికగాను పె - న్కలహమున నాచేతబడితివి - తలఁపు లోపలఁ దారవృత్రా - దులపైన్గల మమతవిడువుము - దునిమె దను కంఠంబటంచును - పలుమాటలాడి - నిలచెను రాచ-తలి రాఘవోఁడి॥

వ॥ ఇట్లు బలికిన నీతిధ్వజుఁడు విని వికలసకలాయుధుండై కామ మంజరిచేతిలో నుచ్చులోబడు పిట్టవిధంబునఁ జిక్కువడి గడగడ వడంకుచు నాపడఁతుకయు దుగులన్దన నడునెత్తిమోపి నుడువులు దడఁబడ దీనభావంబుతో నిట్లనియె.

దర్వు—శహనరాగం—అటతాళం

మానినిబ్రోవవె - మఱుఁగునఁ జేరి - మానక వేడెద - మన్నన గోరి ॥మాని॥

శరణనువారిని - కరుణనుఁజూచి - పరిపాలింతురు - పగకడద్రోచి ॥మాని॥

బలిమిని దెలియక - కలహము జేసి- పలికితి కాచు ము- తలపుఁనఁ బాపి ॥మాని॥

ఎత్తి పెంచితి నేను - మొక్కుకొనంగ - కుత్తుక గోయకు - గోరి మ్రొక్కంగ ॥మాని॥

కోరికొత్తపల్లి - కొమటినేని - వీరయనేలు రఘు - వీరెదబూని ॥మాని॥

వ॥ ఇట్లు భీతిచేతస్కుండై నీతిధ్వజుండు చేతులెత్తి మ్రొక్కంగ యా భూతలనేత్ర తనూజాతకు ప్రీతిఁగలిఁగి ఆతనిని రణస్థలంబునవిడచి తిరిగి తన ప్రాణేశ్వరుండైన హేమాంగదుండు పవళించియున్న వట విటపి సమీపంబునకు వచ్చుచుండెనంత

ఉ॥ తొంగలి రెప్పలందెరచి ♦ తోడనెమేల్కొని దిక్కులన్ని హే మాంగదరాజు జూచితన ♦ మానవతిన్దురగంబుఁ గానక

శృంగారసంగ వచ్చెనతి ♦ భీకరగాఢ కృపాణపాణియై
సంగర రంగ శతృభయ ♦ సాధనయై తురగాధిరూఢయై.

వ॥ ఇవ్విధంబున వచ్చుచున్న కామమంజరిని హేమాంగదుండుజూచి తరుణీ ఈతురగంబునెక్కి శరంబులు శరాసనంబులుబూని నిలచిన కారణంబెయ్యదియో నాకెఱుంగింపుము. అనిన కామమంజరి తురగంబుడిగి కృపాణ బాణాసన తూణీరంబులు తురగంబుపై నెప్పటి యట్లఁబదిలపరచి ప్రాణేశ్వరుని పాదంబులు తన శిరంబుసోక మ్రొక్కి ఇట్లనియె.

దరువు — రాగము దర్బారు — ఆదితాళము

జీవితేశ్వర - తమ-చెవులవినుము నా - మనవిఁదెల్పెదను ॥జీవి॥
నీవునేను నడుఱేయిలేచియీ - త్రోవబట్టియిటురాగ - నప్పటి -
కావలివారలువేగ-మనగతి-భూవరునకుఁ గొనసాగఁ - దెలిపిన -
భావమందుఁ గో - పంబుఁగల్గెనఁట ॥జీవి॥

అంతట నీతిధ్వజుఁడను మంత్రిని - యప్పుడాజ్ఞాపనముజేసి-పంపెనుఁ-
గొంతసేనఁ జతఁజేసి - వారలు కుంతంబులు సరిఁజేసి - మనపై
పంతంబునఁజి - వ్వకుజనుదెంచిరి ॥జీ॥

జనపసైన్యనినదంబు చెవులతోఁ - జక్కఁగనాలించి-రథకే-
తనములు కన్నులఁగాంచి-కొంచపు - పనియని మదిలోనెంచి -
తమని-ద్రనమేల్కొలుపుట-ధర్మముగాఁదని ॥జీ॥

తలచినేనెచని యుద్ధముజేసియు - దండునెల్లఁదూలించి-కాలుని-
నిలయమునకుఁ బంపించి-నర-పతి దళనాయకు నెదిరించి-పోరిన-
కలహమువిడచియు - గడ్డిగఱచెనో ॥జీ॥

కోమటినేని కులుండగువీరయ - కునువరమిను ఖగవైరిఁ - దలఁ
చుమఁ - గామమంజరీసారి - ప్రోవుము-నామీఁదను దయగోరి -
యనుచును- వేమరు మ్రొక్కఁగ-విడచిపెట్టితిని ॥జీ॥

వ॥ అని కామమంజరి దెలిపిన హేమాంగదుండు సంతోషించి కాంచి రంగుపై భార్య చెయ్యి తనచేతఁబట్టుకొని యిట్లనియె.

మ॥ తరుణీ వైరులతోడఁ బోరు వెరవు ♦ న్దార్థ్యత్వము న్నీఁకునీ
కిరణీన్గల్గుట చిత్రమయ్యె క్రమయు ♦ న్కాసంత లేకుండ ను
మ్కరులం జంపితి విట్టిభార్య గలదే ♦ చర్చింపఁగానంచుతా
కరముల్గ్రుచ్చి కౌంగలించె కుచవ ♦ తుంబుల్సరిన్గూడగణా

వ॥ ఇవ్విధంబునఁ గామమంజరిని హేమాంగదుండు గాఢాలింగనము జేసి సతీ నీవిజయంబునుతింప భాషాపతికైన వసతినిల్చునే విశేష ముగా సంతసించితిని లెమ్ముపోవుదము అనితద్దంపతులు బయలుదేరి

ద్వి॥ అచ్చోటువాసి వా ♦ రనతి దూరమున
నచ్ఛమౌనీటిచే ♦ నలరారు నేఁట
స్నానసంధ్యావంద ♦ నము లెల్లఁదీర్చి
పైనమై గుఱ్ఱము ♦ పై నెక్కి రెండు
గడియల ప్రొద్దెక్కు ♦ కాలంబువరకు
కడుసంభ్రమమున నొ ♦ క్క పురీవరంబుఁ
గనుఁగొని దానిచెం ♦ గటవింతలీను
చునువికాసంబగు ♦ సోమోపలముల
బద్ధమౌకాళికా ♦ భవనంబుగాంచి
బుద్ధులు సంతోష ♦ ములఁ దేలుచుండ
నందునడిగి గుఱ్ఱ ♦ ముపనీజమూల
మందునబంధించి ♦ యులసటకొంత
దీరఁగాఁగూర్చుండి ♦ దృఢచిత్తులగుచు
వారలు శ్రీకొత్త ♦ పలి రాముననిమ్ము॥

వ॥ ఇట్లు గూర్చున్నసమయంబున కామమంజరి ప్రాణేశ్వరా! మనము జరిగినరేయి జాగరణఁజేసి మార్గాయాసంబున శరీరంబులు డస్సి

వచ్చియుంటిమి. ఇప్పుడు వంటజేయుట మనకు మిక్కిలి కాలయాపనమాను గనుక ఈపురమునకుఁ దరుబోయి యొకవరహాకు పిండిఁదీసుకొనిరమ్ము ఇప్పటికి భుజంపుదము తమువరి వంటజేసెదను.

తే॥ గీ॥ అనిన హేమాంగదుఁడువిని ♦ యాత్రుణంబె
సంచిలోపలి యొకవరా ♦ సరగఁదీసి
కొనియు వేగమే తత్పు రం♦బునకుబోయి
మెలమిఁ బ్రతివీధిఁదిరుఁగుచు ♦ నిట్టులనియె.

సీ॥ భూసురోత్తములార ♦ పుణ్యమానసులార
పిండియావరహాకుఁ ♦ బెట్టరయ్య
శాశ్యపీపతులార ♦ కవిజనావనులార
పిండియావరహాకుఁ ♦ బెట్టరయ్య
వరకిరీటకులార ♦ వసుసమన్వితులార
పిండియావరహాకుఁ ♦ బెట్టరయ్య
శూద్రమానవులార ♦ భద్రమందిరులార
పిండియావరహాకుఁ ♦ బెట్టరయ్య

తే॥ గీ॥ వృద్ధులార మహానీతి ♦ బద్ధులార
పిండియా వరహాకింత ♦ బెట్టరయ్య
బాలురార సద్గుణ ♦ పాలురార
పిండియా వరహాకింత ♦ బెట్టరయ్య.

వ॥ ఇవ్విధంబునఁ దత్పురంబునన్గల వీధి వీధి నంగడినంగడి దిరుగుచున్న హేమాంగదుని రూపరేఖా లావణ్యంబున కిచ్చగువొంది సర్వజనంబు లాశ్చర్యంబుగా వీక్షింపుచున్నసమయంబున.

ద్వి॥ విరివిగా తత్పురి♦వేశ్యాంగనైన
వరవిలాసవతికి ♦వరపుడుకత్తె

యా చంద్రముఖి మదవతీ ఘోవహిల్లంగ
తోంచినపని జేసిత్తోందరగాను
చక్కగాదలదువ్వి జడచుట్టజుట్టి
చుక్కబొట్టమితమా సొగనుగాదిద్ది
కన్నులకందమా కాటుకబెట్టి
సన్నజాజుల సరుల్జడనిండ జుట్టి
ఒంటినాగరము బల్లోయలుగా బెట్టి
కంటెపట్టెడనాను కాసులదండ
రగమెడదాల్చి యద్దముజూచి మెచ్చి
సొగసైనజలతారు చుక్కలచీరె
రహిగట్టి పైతాణి రవికయుదొడిగి
బహువిధభూష తీర్పాటుగాబెట్టి
నిగ్గుజవ్వాజి పన్నీ రత్తరలది
బుగ్గలుబ్బగను దాంబూలంబుజేసి
పనిబడివీధికి పైనమైమదిని
ఘనకొత్తపల్లి రాఘవునిచింతించి

దరువు—శహనరాగం—అటతాళం

చంద్రముఖవచ్చెన-యారాజవీధికి-చంద్రముఖవచ్చెన- చంద్రముఖి
లెస్స-జాణతనముగాను ॥చంద్రము॥
అందెలుగలగల్లన-కరియానమునసా-నందమతితో మెల్లన-యందంద
నడుగు-లరయుచు నిడుచును ॥చంద్ర॥

చిలుక చుంచుదువ్వుచు- విటకాండ్రజూచి- మొలకనవ్వునవ్వుచు
నిలకడగలిగిన-తొలకరిమెఱుపన ॥చంద్రముఖి॥

సూరిజనుడై మించిన - కోమటినేని - వీరయను రక్షించిన-
చారుకొత్తపల్లి - స్వామినిదలచుచు ॥చంద్రముఖి॥

వ॥ ఇవ్విధంబున చంద్రముఖి రాజవీధినవచ్చుచు కందర్పునిఠీవిదనము క్రీంమగాఁజేయు యా రాజపురందరుని నయనారవిందంబు లానందింప వీక్షించి తనమనంబున వర్ణింపఁదొణంగె.

దర్వు—ఆనందభైరవిరాగం—ఆదితాళం

ఎంతమ్మదుశైనవాఁడీ భూపుఁడు – రాజ – కంతువసంతులఁ బోలు రూపుఁడు-కఁతునికేళిలోనఁ – గౌగిటఁజేర్చనట్టి – కాంతల జన్మములు – గాల్చన థ్యాతిలోపల |నెంత|

నూనూగు మీసములఠీఁదను – జూడ – సానందమొందె నామడెందము – కొనఁబిగికిటఁబట్టఁ – గావచ్చు వాఁడుచంపక-సూనసమనాసవాఁడ-జానుబాహులవాఁడిత-డెంత చేరలనేలు పెద్ద కన్నులు-చెప్పఁ – దీండు వాహ్వా వీనిచెన్నులు – నీరేజపాదుఁడల తెగ -బాలేఁకు తురులవాఁడు – నారీమన్మథుఁడు ముద్దు – గారు సెకు, లవాఁడిత ॥డెంత॥

మోవి పంకెనపూఁతచందము – మోము – భావింప పుష్పితార పందము – ధావళ్యమైనవెన్నెలఁ – దాకు చిరునవ్వువాఁడు – భూవర్యులందటిలో – ఠీవిగల్గినవాఁడిత ॥డెంత॥

భూమిని కొత్తపల్లి ధాముని – ఘనుని – కోమటినేని వీరయ నాముని-క్షేమాస్పదునిఁజేయు – శ్రీరామచంద్రభజన – వేమార కండఁజేయు – విమలగుణాఢ్యుఁడీఁ ॥డెంత॥

వ॥ ఇవ్విధంబున చంద్రముఖి హేమాంగదుని సౌందర్యాతిశయంబు తనమనమ్మున ఘనమ్ముగావినుతించి వెండియుఁ దనలో నిట్లనియె,

క॥ ఈనరపతి మాయేలిక
సానినిఁ జతగూడెనేని • చర్చింపంగా

మానికముకంకణము సం
ధానతగని మిగులఁ గాంతిఁ ♦ దాల్చినవిధమై॥

క॥ ఈలీల మనసులోపల
నాలోచనఁ జేసి యంటి ♦ కరిఁగి రయమునన్
శాలాంగణమున నిలచియు
వాలాయముగా విలా ♦ సవతి యిట్లనియెన్

ద్వి॥ పనిబడియు విలాస ♦ వతి యాత్మ ణంబె
నన్మైనపన్నీట ♦ స్నానంబుఁ జేసి
దసిలీజర్ చీరఁ ♦ దగఁ కటిఁ గట్టి
పసగల్గురవికె పు ♦ బ్బలమీఁదఁ దొడిఁగి
సంపఁగినూనె కే ♦ శములకుఁ బూసి
వంపు లేర్పడఁ దువ్వి ♦ బల్జక్క వేసి
కెంపురాగిణిఁ బెట్టి ♦ కీల్జడమీఁద
పింపిణీబిళ్ళలు ♦ బేరుగాఁ దీర్చి
తగు నాగరంబు కే ♦ తకిచంద్రవంక
సిగదారములతోడ ♦ సిసలుగాఁ గట్టి
కత్తెర బావలీ ♦ ల్కమ్మలుగొలుసు
లత్తరిశృంగార ♦ మమరధరించి
తారహారంబు లు ♦ త్తండాలు నాను
బారుకాసులదండ ♦ పట్టెడ కంటె
మొదలుగాఁ గల్గు సొ ♦ మ్ములు బెట్టుకొనియు
తదుపరి నిల్వుట ♦ ద్దంబులోఁ జూచి
చెక్కుల మకరిక ♦ ల్చిన్నుగా వ్రాసి
ముక్కునమూఁడు సొ ♦ మ్ములు బెట్టుకొనియు
తేటగాఁ గస్తూరి ♦ తిలకంబు దిద్ది
కాటుక సన్నగాఁ ♦ గనులకుఁ బెట్టి

నడుముకొడ్డాణ మం ♦ దముగఁ బిగించి
కడియ ములమ్రొద్దు టుం ♦ గరములుదొడిగి
పుక్కిటినింగ తా ♦ంబూలంబుఁ జేసి
తళ్కొని మేనన ♦ త్తరుఁ గందమలఁది
వంతుకెక్కిన కొత్త ♦ పల్లిరాఘవుని
స్వాంతమందుననమ్మి ♦ వచ్చెనుసరగ

దర్వు—శహానరాగం—అటతాళం.

వెడలె విలాసవతిమది - వేడ్కలూరఁగ - కడు ప్రేమఁగల్గు చెలు
లిరు-గడలను విడువక - నడువఁగఁ- దడయక ॥వెడ॥

సొక్కైన వెండిజరిగల - కోకకుచ్చెళ్ళు - మోకాలిపైన దాపలి -
కైకొన్న వేళ్ళను - ఠీకుగఁబట్టుక ॥వెడ॥

పునుగు జవ్వాజి వాసన - లెనయఁదిక్కులను - మునులనైననుఁ
దాసు-లనుఁ జేఁతును నొక-క్షణమునననుచును ॥వెడ॥

జారపురుషులమతుఁ-నీరుఁ జేయుచు-వారజూపులదగు నొ-య్యారపునడకలఁ-దోరముమీఱఁగ ॥వెడలె॥

ఇలనఁ గోమటినేని-కులునిపేరయును—విలసిల్లఁ జేయు కొత్త - పలి
రామునిమది - నిలిపి దలంచుచు ॥వెడలె॥

వ॥ ఇవ్విధంబున విలాసవతివచ్చి చంద్రముఖిఁ నిజూచి గాఢాలింగనముఁ
జేసి అమ్మా! చంద్రముఖి నీవింతకుముందుగాఁ పనిఁబడి బజారుకు
వెళ్ళియుంటివి ఇంతలోనే తిఱిగి యింటికివచ్చి నన్నుఁబిలచిన కార
ణమేమో చెప్పవమ్మా! ముద్దుగుమ్మా!

వ॥ అనినఁ దాసీరత్నంబిట్లనియె.

చ॥ పొలుపుగనేఁ బజారునకు ♦ బోయితినక్కడ నొక్క మొల్లమీ
సలు సొగసైన ముంగురులు ♦ చక్కని నవ్వుమొగంబు ముష్టిలో
పల సరిపోవు నెన్నడుము ♦ పల్చని చెక్కులు దీర్ఘబాహువుల్
గలిగినవాని కాముకునిఁ ♦ గంటిని కంటికిఁ గూర్మిఁదీరఁగా

క॥ ఈ కమలాక్షుఁడు జూడఁగ
మా కమలాక్షికిని దగిన ♦ మానిసియని నే
నో కమలానన వచ్చితి
నీకిది దెల్పంగ నాతఁ ♦ డిటనుండఁడో॥

క॥ ఓ యక్క యాకుమారుని
దేఁ జూడరో యెచటవిడిదో ♦ యెంకులకిటకు
వ్చాయతవచ్చిన వాఁడో
యే యొరిపిడి చనఁలబోఁటి ♦ యింటికిఁబోనో॥

వ॥ ఆలస్య మమృతం విషమన మాఁట స్పృహకుఁ దెచ్చుకుంటివో
లేఁదో తోఁచకయున్నయది. అక్కమారతిలకంపు నిర్నిద్రదృష్టికై
మన్నే తంబు లురుకుచున్నఁయవి. అనిన విలాసవతియును తానును
నిజచంద్రశాలాంతరంబున నిలచి నా వేశ్యారత్నంబునకిట్లనియె.

క॥ చూడవె యా సురసాఁవు
నీడను నిలుచున్న వారి ♦ నేర్పుమెయి న్మా
ట్లాడుచు నవ్వొలయించెడు
వాఁడే నీతోడ నన్న ♦ వాఁ డేలికరో॥

వ॥ ఇట్లు జూపించిన నాసుందరాంగి డెందం బానందంబొంది తల
యూచి నాస్యాగ్రస్థ తర్జనియై చంద్రవదనన్గాంచి.

దర్వు—తోడిరాగం—ఆదితాళం.

చూడలేఁదే వీనిఁబోలిన-కోడెకానిని సుందరి-కాఁడు కల్లాల-లేఁడు
సరిగాలేఁడు-పూవిలు-కాఁడు నేఁడు జోడునాకు॥చూడలే॥

చేఁతికందని నూగుమీసము-లేఁతపాఁపపువాఁడ హా-యీతనిని నా-
చేఁతిలోనే-కీతినిల్వఁగఁ-జేతుసీతలోదరిహా ॥చూడ లే॥

కుందసము మెయితళుక్కు నెమ్మొగ-మంద మింపునిఁజ దహా- కుంద
ము లు ర ద-బృం ద ము న కు ను-విం దు సే యు వ-సంముఁ
పొంకుఁజె దుటిట్లో ॥చూడ లే॥

చాలఁ గోమటినేఁవీరయ-నేలు కొత్తపలీపుని-లీల సీతాలోలుసద్గుణ
బాలు తుషితకు-చేలు శ్రీలమేలు నెంతు ॥చూడ లే॥

సీ॥ కన్నులాతమ్ముల ♦ కన్నలాయనుపించు
మధ్యంబు మృగపతి ♦ మధ్యమెన్ను
బొమ్మలా మరుశరా ♦ సమ్ముఁ గిందొనరించుఁ
గుఱులు తుమ్మెదపేండ్ల ♦ గరులనేలు
నుదురు చందురునిఁకిం ♦ దొడగఁజేసి చరించు
నవ్వు వెన్నెలలను ♦ నవ్వుచుండు
పెదవి రక్తిమబింబ ♦ మదరఁగొట్టఁగనోపు
చెవులు తొమ్మిదులను ♦ నవలఁద్రొక్కు

తే॥ గీ॥ రొమ్ము చూరుని మీటి పీ ♦ ఠమ్ము మించు
హస్తములు జానువుఁ దాఁటి ♦ హవుసుమీఱు
సాయగంబెల్ల నొక్కపై ♦ సొంపుతోడ
యితనిరూపంబు గనుబట్టె ♦ నేమొచూడ॥

కం॥ ఈ చెలికాఁడొగిఁ జెయి పై
వై చిననాదినము స్వర్గ ♦ వైభవమెల్లన్
రోచించకఁ జేకొనుగతిఁ
దోఁచెన్నామదికి ఫుల్ల ♦ తోయజవదనా

ద్వి॥ చెలువకో యీతని ♦ చెలఁగి వర్ణింప
నలువకైనను ఫణి ♦ నాథునకైన

తరముగాదమ్మ సుం • దరి జెప్పవమ్మ
పరితోషమున మేడ • పైనెక్కినిలచి
ఇతనిపై కన్నువేసి • యింపొప్పమనము
జతఁగూడిముచ్చట • లనువు మనుష్న
ఈ మోహనాంగుఁడిం • కెక్కడికైన
కోమలి బోవునో • కోరికతోడ
ఏమానినీమణి • యింపొప్పవీని
ప్రేమించి యింటికి • బిలుచుకఁబోనో
చెలువ పిమ్మటనేమి • సేయంగఁగలము
తలఁపుఁగోర్కె వృ • థాగఁగఱించు
కావున నీవేగ • క్రమవాక్యముల
భావంబు గటిఁగించి • భ్రమలుగల్పించి
ఆమేటి గోరిన • వన్నియుఁదీర్చ
గామోదమునఁ బల్కి • కల్కిరోవాని
నామేడపైకిఁ గ్ర • న్ననఁ దోడితేవె
కామినీమణి వ్రజ • కంకణంబిత్తు
ననుచు బల్కినఁదెంద • మానంద మొంద
మొనసినవ్వుచుఁ చంద్ర • ముఖ కొత్తపల్లి
పురివరవాసుఁడా • భూసుతాపతిని
సరవితోఁదలఁచుచు • సరగనిట్లనియె

దర్వు—శహనరాగం—అటతాళం

తోడివచ్చెద నీదుమేడకుఁ - దోయజానన జూడవే - రాఁడో
వచ్చునోయనెడి సంశయ - మోడకను విడనాడవే ॥తో॥

ఇచటనుండక లేఁచివేగ మ - యింకనెక్కడ బోయిన - ప్రియుర
గతిఁ గొనివత్తునిది నా - భారమెదలోనమ్మిన ॥తో॥

తే॥ గీ॥ ఇవ్విధంబున నేలివ ♦ యింతిమాట
శిరమునను దాల్చి సంతోష ♦ చిత్తయగుచు
మేడపైనుండి దిగివచ్చి ♦ మేలుశకున
మొకటిఁగని కార్యనిశ్చయం ♦ బిఁకఁగలదని

తే॥ గీ॥ కొంచెమోపికతోనటు ♦ పొంచి పొంచి
మంచి సమయంబుగని నూత్న ♦ పంచశరుని
గరిమఁదనరారు నాథరా ♦ వరకుమారు
నెమటికినిపోయి మ్రొక్కఁడి ♦ యిట్లుబలికె

కందార్థము.

ఎవ్వరివాఁడవు జనకుం-డెవ్వఁడు నినుగన్నతల్లి - యెవ్వరు నీవిం - దివ్విధమునఁ జరియించెద - వెవ్వరికై దెలుపుమయ్యా- యీవిధ మెల్ల - నిన్వడచినేఁ-బోవఁగనొల్ల - వాసిరినీమోము - వాఁడి యున్నతమ్మి - రీవిఁగన్నబైడు - దేవానిజంబుగా - పావనకీర్తి -శత శతకోటి - భావజమూర్తి

ఉ॥ చక్కఁదనంబు వేమరుల ♦ సాటికిరాని వకన్దైలంగునీ
చెక్కునసీవు మాపుఁకి ♦ నిచ్చమెయిఁజనుదెంచి భోజనం
బెక్కడలేకయున్నగతి ♦ నేర్పఁచున్నది నీముగంబుపైఁ
జిక్కనఁ జెల్వనున్గడమ ♦ చెయ్యులుజూడఁగ నామనంబునన్.

ఆ॥ వె॥ గీ॥ దాఁచిపెట్టరాఁదు ♦ తరుణంబువచ్చిన
నేరికైనఁ బూరు ♦ షేంద్రనాథుఁ
దెలియఁజెప్పుమయ్య ♦ తేటతెల్లంబుగాఁ
జాలుమాలకేను ♦ మేలుజేతు.

కందా॥ మగవాఁడవు మగువలతో - మగటిమిగామాటలాడ-మానెద
వయితోనగరాట్కుచలిదిగన్నను-నగరావిస్ఫురదమేయ-నరి

నాయతాక్షు। మా క్తికహార-కలితసద్వక్ష-పలుమారునినుఁజూడ।
భ్రాంతిఁజెందించెనీ-చెలువెల్ల కనులకుఁ-జిత్రచిత్రింబయ్యె-ఖల
జనశిక్ష - మాదృశ పూర్వా-చలకుచపక్ష॥

తే। గీ॥ ఇట్లువల్కెడు చెలిఁజూచి ♦ యింపుగుల్కఁ
దనచరిత్రంబు జెప్పఁగాఁ ♦ దరియటంచు
మదిని సంకోచమెల్లను ♦ మాని దాని
ఎదఁజెలంగఁగఁ బలికెను ♦ మృదులఫణితి.

కందా॥ రాజకుమారుఁడనే పు-రాజభయంకరుఁడ-సుగుణ-రాజి దన
గుడుకు-రా తెగతి నీపురకినిఁ-దేశంబలరిగనువచ్చి-తిని చంద్ర
వదన-ఆపనిఁజెప్పె-గనీ సుందరిదన-ముసఁగొని న్రాపేయు-సిని
నొక్క స్థలమునం-గునివిచ్చితి పిష్ట-మునుఁ గొనిపోవగా-వని
తాలలామా-నాపై ప్రేమ-దనరిసుభామా॥

ద్వి॥ పిష్టంబుదొరుకదు ♦ పేర్మినినేను
కష్టించి యడిగినఁ ♦ గాని యూపురిని
ఎనిమిదిగంటల ♦ కీయూరుజొచ్చి
తిని దుకాణంబులు ♦ తిరిగియుఁదిరిగి
పిసుప్పుఁగల్గెన నాకు ♦ విధుబింబవదన
పొసఁగ నాకలిమించి ♦ పోవుచున్నదియు
మఱియొక గ్రామంబు ♦ మార్గంబుబట్టి
తరుణిగో పోవంగఁ ♦ దలచితినేను
ఇది దుష్టపురివరం ♦ బిది పాపభూమి
యిదిరాజధాని గా ♦ దిది సజ్జనులకు
సిరనైనచోటుగా ♦ ది దీవరాక్షి
కరుణాకటాక్షంబు ♦ కరముగాఁగల్గి
మది పాపమనియొక్క ♦ మానిసిగ్రామైన
సదయులై మర్యాద ♦ సలుపలేరైరి

ఆమోదమలరు సిం ♦ హాశరాజసుతుఁడ
హేమాంగదుండని ♦ మెల్లరుబిల్తు
రఖిలరాజన్యమ ♦ హారాజిఁగొలువ
సుఖమొందువాడని ♦ నిస్తులకీర్తి యుతుఁడ
నైననామర్యాద ♦ లన్నియునిచటఁ
గానవచ్చునె కాల ♦ గతి యిటులున్న
అనిపలుకన్నృపునివృ ♦ త్తాంతంబుదెలసి
మనసునుగనిపెట్టి ♦ మగువయిట్లనియె.

దర్వు—అపరూపరాగం—ఏకతాళం.

ఇంటికిరమ్మీనా - వెంటవేవేగ - వంటకమిప్పుడు - వడ్డింతుబాగ ॥ఇం॥
ఆఁకలిఁగొంటి వ - య్యారయ్యాయీ వేళ్ళ- నీకాళ్ళుగడిగింతు-నే వే
డిఁనీళ్ళ ॥ఇంటి॥

పిష్టంబుపిమ్మటఁ-బెట్టింతునీకుఁ-గష్టంబులన్నియుఁ-గాంచెచీకాకు॥ఇం॥
నిరతంబుఁగోమటి-నే ని పీ ర య్యా - వ ర దుఁ డా శ్రీకొత్త-పలి
రామునమ్మి ॥ఇంటి॥

వ॥ ఇవ్విధంబున నాసుందర మందిరుందోడ్కొని చని సౌధాగ్రంబున నున్న విలాసవతికడకుఁజేర్చిన నాకంజనయన దిగ్గున లేచి నమస్కరించి కనకమయాసనంబుపైఁ గూర్చుండనియమించి తేనెలొలుకుఁ బలుకులతో నిట్లనియె॥

ఉ॥ చందనచూర్ణమున్నలిపి ♦ చక్కఁగఁ గాఁచిన నీరమిప్పుడే
బిందియలందుఁ దోఁడిరి వి ♦ భీతమృగేక్షణలింక వేడ్కఁబూ
ర్ణేందునిభాస్యతానము ర ♦ హిన్వడిఁ జేసిదుకూలవస్త్రమిం
పొందగఁగట్టి కొమ్ము కుసు ♦ మోజ్వలచారు శరాససుందరా॥

వ॥ అనిపంటయింటిలోపలికిఁ దోడ్కొనిపోయి

ఉ॥ దంతపు కాళ్ళపీటయిది ♦ తప్పక మీరలుగూరుచుండి సం
ధ్యాంతముగాఁగఁ జేసికొని ♦ హాయిగఁ పిమ్మటనీవు మామక
స్వాంతము సంతసిల్ల సర ♦ సాన్నములన్భుజియించి శయ్యపైఁ
గొంతసుఖంబుఁజెంది గనుఁ ♦ గూర్కొనుమేల్కొనవచ్చు రాత్రికిన్

ద్వి॥ ధరణీశ భోగము ♦ దాని నేనొటఁ
బరికింపఁగా ధరా ♦ పతివినీవొటఁ
బొలుపొందఁగా నేను ♦ భోజనంబెటుల
సలుప నచ్చునటంచు ♦ సంశయమొంద
వలవదు మాయింట ♦ ప్రతిదినంబునను
జలజాక్షుపూజలు ♦ సలుపుచునార
గింపొనరించఁగ ♦ క్షితిదేవునొకని
నింపుగా నేర్పాటు ♦ నేఁజేసినాను
ఆమహానీయుఁడ ♦ త్యానందమొప్ప
భాగ్రమికవండిన ♦ వంటలు సుమ్మి
ఇది కేవలాన్నమిం ♦ పిది పులిహోర
యిదిశర్కరలపొంగ ♦ లిదియుదధ్యశన
మిది కేసరీభాతు ♦ నిది వాంగిభాతు
నిది విచిత్రాన్నంబు ♦ నిది పరమాన్న
మివిమాషచక్రంబు ♦ లివి తేనెతెరలు
నివి యతిరసములు ♦ నివి పూర్ణబూరె
లివి మంచిపూరీలు ♦ నివియె బజ్జీలు
నివి చక్కిలంబులు ♦ నివి పాలు పెరుగు
నిఱవుగానీకేది ♦ యిష్టమోదాని
సరసత భుజయించు ♦ క్ష్మానాధచంద్ర.
అనిబల్కి భోజనం ♦ బైనపిమ్మటను
కనకాంగియా నృపా ♦ గ్రణిఁదోడితెచ్చి

చెయిఁబట్టి గదికిఁదాఁ ♦ జెచ్చరఁదీసి
నయమైనమాటల ♦ నాతియిట్లనియె॥

దర్వు—రాగంపూరికల్యాణి—రూపకతాళం

ఇదియెచూడు పూలపాను - పెక్కువయ్య జారనాయకయిఁక -
ఇది- విదితంబుగ నేనొసంగు - వీడియమును - వీడకనతి - వేడు
కతోఁజవిఁ- జూడుముదొర ॥ఇది॥

మోవినొక్కు మున్దువెట్టు - తీవితోడఁగొఁగలించుముదొర - భావ
భవుని కేళిలోను . పాయంబున - కాయంబునఁ - కాయంబున -
జేయుమొకటి ॥ఇ॥

గట్టిచన్నులివియెచేతఁ- బట్టవయ్య-పట్టువదలకఁ - దిట్టమైనవన్ను
రతులఁ - దేలింపుమ - రాలింపుము - పాలింపుము - లీలాంగజ॥
మానితగతిఁ గోమటి - నేని వీరయాఖ్య సత్కృపతోఁ - బూని
బ్రోచు కొత్తపల్లి - జానకివరుఁ - మానినదయ - తోనినువను -
మానకేలు ॥నిది॥

తే॥ గీ॥ సరసమొప్పఁగ నావిలా ♦ సవతి జేయుఁ
జారుమదనోపచారము ♦ ల్వాంతమందు
నతులసంతస మొనరింప ♦ హాయిఁజెంది
దానిఁగన్గొని పలికె ని ♦ దానమొప్ప.

ఉ॥ అలికులవేణి నీవిపుడు ♦ హాయిగఁజేయుఁ సపర్యలన్ని మ
ల్లలిత మనంబుకున్దగిలి ♦ లావొనరించెను సంతసంబు నీ
వలెను పరోపకారగుణ ♦ వర్తినిఁ గాననుముజ్జగంబుల
న్భళిభళినిన్ను మెచ్చితి శు ♦ భంబగు నీకు మరాళగామినీ

తే॥ గీ॥ అచట హేమాంగదుండు కా ♦ లానుసరిణిఁ
బడుపుఁ జెలిమాయలోపలఁ ♦ బడి ప్రియంపు

టెంకిపైయానవదలిన ♦ నిచట కాళి
కానికేతనమునన్న ♦ కాంతయపుడు

కం॥ ఈ యూరిడెదగ్గరదే
పోయినపోకడలెగాని ♦ పోంకముతోడ
న్డాయఁగనాథుఁడురాఁడిది
మాయఁగఁగన్పట్టెనాఁడు ♦ మానసమునకున్

సీ॥ రాఁడాయనావిభుఁ ♦ డేఁడాయ నిముసంబు
కడాయనక్కటా ♦ నేఁడుమదికి
శత్రువుల్డాసిరో ♦ సమరంబుజేసిరో
కష్టముల్దోఁచెనో ♦ కాంతునకును
సియూరనుంచెనో ♦ యేయూరుబోయెనో
దారికెనోప్పిష్టంబు ♦ దొరకలేఁదో
ఆకలిమించెనో ♦ యలసటఁగాంచెనో
యెంచియెవ్వరుఁ బల్క ♦ రించలేఁదో

తే॥ గీ॥ ఎలమితో సందుఁగొందుల ♦ నెవ్వరైనఁ
గుడువఁబెట్టిరో యింటికిఁ ♦ గొంచఁబోయి
కాలవశమున నామీఁదఁ ♦ గరుణమాని
యెంటిమైతాను నిద్రించు ♦ చున్నవాఁడొ.

ద్వి॥ అయ్యయ్యో నేఁడేమి ♦ యన్యాయమాయెఁ
దియ్యవిల్కాసినిఁ ♦ దేవేంద్రుశశిని
ధనదపుత్రుని వసం ♦ తజయంతయుగము
ఘనసుందరఁబునఁ ♦ గడకునెట్టఁదగు
లావణ్యమందున ♦ లాపైనవాఁడు
తాపులు వెదఁజల్లు ♦ తనువొప్పువాఁడు
పెద్దకన్నులవాఁడు ♦ పేరైనవాఁడు
సిద్దంపుఁజెక్కుల ♦ నిగనిగల్వాఁడు

కద్దు లేదనఁగాను ♦ గలిగినవాఁడు
ముద్దులుగారెడు ♦ మోముగలాఁడు
గడియమానల క్రిందుఁ ♦ గడఁజేయునట్టి
కడిమిఁ గల్గిన దీక్ష ♦ కరములవాఁడు
చెలువొందుచున్నట్టి ♦ శ్రీకారములకుఁ
దులఁదూఁగు వీనులఁ ♦ దోరంపువాఁడు
కరముకందని మీస ♦ కట్టుండువాఁడు
కరమొప్పు ముంగురు ♦ ల్గలిగినవాఁడు
పొలుపు వంకర కన్ను ♦ బొమ్మలవాఁడు
పలుకులలోఁ దేనె ♦ బరగినవాఁడు
వెడలుపు రొమ్ముచే ♦ వెలసినవాఁడు
మెడ శంఖమును బోలి ♦ మెఱసినవాఁడు
అసమాన విక్రమం ♦ బలరినవాఁడు
రసికాగ్రసరుఁడయి ♦ రంజిల్లువాఁడు
చనువు చేతను నర ♦ తృణమైన నన్నుఁ
గనుఁగొనకను నిల్వఁ ♦ గా లేనివాఁడు
ఇట్టివాఁడింతసే ♦ పిటకు రాకుండు
టెట్టి విచిత్రంబొ ♦ తెలు గంగ రాఁడు
అనుచుఁ దిక్కులు జూచు ♦ నటు తలయూచు
మనములోఁ బలుగుందు ♦ మతిభ్రాంతిఁ జెందు
కరముఁ జెక్కిటనుంచుఁ ♦ గన్నీరునించు
బురపురమని బొక్కు ♦ పొంకంబు దక్కు
పుడమిపైఁ బడిఁ బొర్లు ♦ పొలఁతి వెతల్ల
వెడమాటలను బల్కు ♦ వేసటనుల్కు
నూరికేఁ బోఁబూను ♦ నొఁగినటు మాను
హారంబులను ద్రెంచు ♦ నవి బరికించు

హాయముచేసవకేల ♦ నదినెక్కఁమాఁగు
శయముచేతనుమవ్వ ♦ చనువొప్పనవ్వ
ఈరీతిఁ గొంతసే ♦ పిందీవరాక్షి
వారనిచింతలో ♦ బడికొత్తపల్లి
జానకీపతిపాద ♦ సరసీజములను
మానకఁదలచుచు ♦ మరలనిట్లనియె.

దర్వు—తోడిరాగం—రూపకతాళం

ఎటులఁబోతివో - నాప్రాణనాథ - యెటులఁబోతివో - దిటము
మానినేనుఁబంప-హాటముఁబూని - యిటకురాక ॥యెటుల॥
తెమ్మటన్నఁ బిండిదేక - సమ్మతి నాజాడఁగొనక ॥యెటుల॥
నిముసమైన నన్నుఁబాసి - నిల్వలేనినీవయోనే ॥డెటు॥
అనుదినంబునాపైగలఁ - కనికరమెక్కడనుదాఁచి ॥యెటుల॥
ఎలమి కొత్తపల్లిపుర - మేలు రామునెన్నుచునీ ॥యెటుల॥

సీ॥ పలుచనినామోవి ♦ పానకంబిత్తునే
నిప్పుడు నీకెవ్వ ♦ రిత్తురయ్య
గుండ్రటినాచను ♦ ల్గొనుమనియిత్తునే
నిప్పుడు నీకెవ్వ ♦ రిత్తురయ్య
జిగిచెక్కుటద్దము ♦ ల్దగనొక్కనిత్తునే
నిప్పుడు నీకెవ్వ ♦ రిత్తురయ్య
కరముప్పఁ బిగియారఁ ♦ గౌఁగిలియిత్తునే
నిప్పుడు నీకెవ్వ ♦ రిత్తురయ్య

తే॥ గీ॥ కటకటా పాపదైవంబు ♦ గామమొదలు
పేర్మితోడను సంతోష ♦ పెట్టితుదకు
మనలనెడఁబాయఁగాఁజేసె ♦ మాయవేష
ధారి యనుమాటలన్నియు ♦ దార్థమాయె.

వ॥ అని హయరాజంబు కడకున్న దాని మేను నివురుచు కన్నులనీళ్లు దుడుచుచు నిట్లనియె.

సీ॥ సమయంబునకుఁదన ◆ సాహిణి లేకున్న
నీమేనునలిచెడు ◆ సామియేడి
శెనగపప్పులను తీ ◆ యనిపంచదారయు
గలిపి నీకిడునట్టి ◆ కాంతుఁడేడి
కనిహాసుగనుజూలు ◆ గత్రించి మొగముపై
వెంట్రుకలుంచెడి ◆ వీరుఁడేడి
చెలువుగాఁ గళ్ళెం ◆ బెలుగట్టి పైనెక్కి
పరగనాడించెడి ◆ సరసుఁడేడి

తే॥ గీ॥ పవలుతేయును నీపైన ◆ ప్రాణములిడి
అన్ని విధములఁ పోషించు ◆ చున్నతేఁడు
నిన్ను నన్నునువిడనాడి ◆ యున్నవాఁడు
నాయమైయున్నదమ్మ యిం ◆ ద్రాయుధమ్మ.

ఉ॥ ఉక్కునయున్నియాయుధము ◆ లూనిరవి ప్రతిభద్దులిర్చినీ
నెక్కెడువాఁడు శత్రువుల ◆ నేర్చెడివాఁడు భయప్రకంపనం
బెక్కడలేనివాఁడు నిజ ◆ హేతిపడి నష్టిపించువాఁడునేఁ
డెక్కడనున్నవాఁడో మన ◆ కెవ్వరుదిక్కిఁక వీతిరత్నమా

వ॥ అని దిక్కులన్నరిశీలించి కనుగొలఁకులఁగారు శోకవారిద్దుడుచుచు కొనుచు శిరఃకంపంబొనర్చుకొంచు దుఃఖరసంబుతో

సీ॥ తూర్పుదిక్కాంతమ ◆ చ్ఛుభకాంతుఁజూచితే
తొగలకాయనిమిూరు ◆ మొగమువాఁడు
దక్షిణాంగన మదు ◆ దారేశుగాంచితె
కనుబొమల్వొంకర ◆ గల్గువాఁడు

పడమర కలినాడు ♦ భర్తనేఁగంటివె
మొలక మీసలచేతఁ ♦ గులుకువాఁడు
ఉత్తరరమణిమ ♦ చ్చిత్తేశుగానవె
తళుకైన చెక్కుట ♦ ద్దములవాఁడు

తే॥ గీ॥ పరగఁ గగనమ్మనీకుఁ ♦ గన్పట్టెనమ్మ
నావిభుఁడు నీటుకాఁడు కె ♦ మ్మోవివాఁడు
క్షితిధరగళమ్మ యెఱిఁగితేఁ ♦ జెప్పవమ్మ
నాప్రియుండగు జేఁడు మ ♦ న్మథునిజోఁడు

వ॥ అని గగనదేవతన్నూర్చి నమస్కరించి చేతులుజోడించి మృదు మధురవాక్కులతో నిట్లనియె

ఉ॥ తల్లినిజంబుజెప్పుటకుఁ ♦ దైవమువిన్ను శృజించెగానినా
యుల్లముపల్లవింపగ మ ♦ హోజ్జ్వల విక్రమశాలి నామనో
వల్లభుఁజాడ సత్యముగ ♦ భాస్వరమా భవదీయవాక్కుల
న్నల్లగఁదెల్పి నీయశము ♦ సర్వదిశల్వడి నిండఁజేయుమా.

వ॥ ఇట్లు స్తుతిఁజేసినను గగనదేవత ప్రత్యుత్తరంబియ్యకున్న నిబిడ దుఃఖసమాక్రాంతయై మోహాఫలస్వాదు వాచానికరంబులతో

సీ॥ శ్రీరమావాణీంద్ర ♦ దారాప్రముఖసతీ
ప్రనుతస్ఫురద్గుణ ♦ పాలికాళి
కమనీయకస్తూరి ♦ ఘనసారచందన
పరిలిప్తసత్కుచ ♦ పాళికాళి
పృథుతరస్వీయకి ♦ రీటరత్నద్యుతి
హృతచండవైశాఖ ♦ హేళికాళి
సురనాథయమధర్మ ♦ వరుణకుబేరాద్య
హీనసదాభక్తి ♦ హేళికాళి

తే॥ గీ॥ రూఢకుంతల సందోహ ♦ రుచిచయజిత
గాఢబంధుర వరగరు ♦ త్కాళికాళి
మహిష దానవమస్తక ♦ మధనకరణ
కృతవినిష్ఠుర తరరణ ♦ కేళికాళి

ఉ॥ దండము దండమమ్మనినుఁ ♦ దప్పకవేడితి నమ్మయిప్పుడే
గండముఁబాపినామగని ♦ గ్రక్కున నాదరిఁ జేర్చినీయశః
కాండము దిక్కులన్నిలిపి ♦ గౌరవమున్గొనవమ్మ మత్తవే
దండసమానయానబల ♦ దర్పసమున్నతి కాళికాసతీ.

వ॥ ఇవ్విధంబున స్వనవాస్త్రవిరోధి వధూటిన్గూర్చి స్తోత్రంబుంజేయు
చున్న కామమంజరి నద్దాలయ పూజారిణియగు నొక్కమధ్యవయః
కాంతజూచి తదీయ విలాసలావణ్యంబుల కత్యాశ్చర్యంబొంది
డోలాయమాన మానసయై యాకుందరదన కిట్లనియె

చ॥ ఎవరివధూటివమ్మ గురుఁ ♦ డెవ్వడు తల్లియెవర్తె యేడనీ
భవనము నేఁటికైనిచటఁ ♦ బావుర మంచతి చింతఁజెంది యు
న్నవిపుమంతయైన రోదఁ ♦ దాల్చక యుండుటకేమి హేతువో
నవిమెఱుంగఁజెప్పుము ప ♦ వేకకలాప కలాపసంయుతా.

వ॥ అమ్మాయి యీపె యెవ్వరోయని సందేహించిక నీవెందుకొరకిట్లం
గలార్చుచున్నదానవో సవిస్తరంబుగాఁదెల్పు నాచేతనైనసా హా
యంబొనర్చెద నీవు నాకు కూఁతురివంటిదానవు నేను బుట్టిననాఁట
నుండి పరులకష్టంబులు జూచి సహింపనోపఁగాన యోచించుము
అనెడుపలుకులకలరి నారమణినవ్వుగలించుకొని కనుగొలఁకుల నీళ్లు
రాల్చుచు మహాదైన్యరసంబుతో

ద్వి॥ తెరవనేనేమని ♦ దెలుపుదునమ్మ
గరితనాజన్మాది ♦ కథలు నీకిపుడు

పొలుచునాగపురంబుఁ ♦ బుట్టినయూరు
బలుఁడు ధర్మధ్వజ ♦ ప్రభుఁడు నాతండ్రి
సరవితోఁ గామమం ♦ జరియని పేరు
బరగునునాకు శం ♦ భద్గతితోడ
మామామ సింహళ ♦ మనుజనాథుండు
హేమాంగదుఁడు మామ ♦ కేశ్వరుఁడమ్మ
విద పుట్టిన నాట ♦ నుండియుసౌఖ్య
మవిరళగతిఁజెంది ♦ తహరహంబులనా
నాచకాఁదనమెల్ల ♦ నయవృత్తితోడ
దాఁచకఁ పటమునఁ ♦ దళ్కొత్త్రవాసి
పేర్మి విప్రులకిచ్చి ♦ పెంపుగాఁబంప
నర్మిలీవారుదే ♦ శాటనమెలమిఁ
జేసి సింహళరాజ ♦ శేఖరసుతుని
వాసిగాఁగొని తెచ్చి ♦ వలనుగాఁజూప
నాతండ్రియతనికి ♦ నన్నిచ్చి పెండ్లి
ఖ్యాతిమీఱఁగఁ జేసె ♦ ధాత్రీసురులలర
అంతటకొన్నాళ్ళ ♦ నతిసౌఖ్యమంది
కాంతుఁడు దన యూరు ♦ గనుగొను వేడ్క
బోవఁజూచిననేను ♦ పొంపుగారాగ
నీవీథిపై నెక్కి ♦ నిద్దరమిటకు
వచ్చుచో నాతండ్రి ♦ వలనుగాఁదనకు
మచ్చిగఁదెల్పక ♦ మదవతిఁగొంచుఁ
బోవుచున్నాఁడు ♦ పోయిమీఱతని
వావిరిఁబట్టుక ♦ వత్తురుగాక
అనిపంప సేనాస ♦ మాన్వితంబుగను
మనుఁడు నీతిధ్వజ ♦ కదనశూరుండు

వచ్చిపైఁబడువేళ ♦ వరుఁడునాయంక
మెచ్చుగాఁబరిధాన ♦ మేర్పడ నిద్ర
నూల్కొనుతఱి లేప ♦ నొల్లక మదిని
యుల్కుచే నే లేచి ♦ హారి నెక్కువారి
నెదిరించికొందఱు ♦ నేడ్తెరఁ గూల్చి
మదలీలఁ గొందఱి ♦ మదమణఁగించి
చిందరవందరఁ ♦ జేసిన వార
లందఱు చీకాకు ♦ నందియుఁబోవ
పతితోడఁ గూడి శం ♦ భల్లీలనిటకు
హితవొప్పఁ జనుదెంచి ♦ నీగుడినుండి
ఆఁకలియగుటచే ♦ యుక్కటపతిని
రూకయొక్కటియిచ్చి ♦ రుచిగలభోజ
నార్థవస్తువులు తె ♦ మ్మని వేడ్కఁబల్క
గర్హించ కతఁడు చ ♦ క్కని కూర్మితోడ
ఘోటకంబునునన్నుఁ ♦ గుదురుగానిచటఁ
బాటవంబుననుంచి ♦ భామరో గడియ
కరుగుదెంచెదనని ♦ యుతేఁగెనీపురికి
కరుణగల్గినవాఁడు ♦ కామినీమరుఁడు
పటుపరాక్రమశాలి ♦ పండితప్రియుఁడు
చటులమాణిక్యాంశు ♦ జాలభూషణుఁడు
చక్కనివారిలోఁ ♦ జక్కని వాఁడు
అక్కపోయినపోక ♦ యంతియేగాక
జాడబొత్తిగ లేఁదు ♦ చానయేమందు
నీడ నన్నోర్చు వా ♦ రెవ్వరు పుట్టి
నింటికి కీడైతి ♦ నికనేది త్రోవ
కంటకులెవరైన ♦ కదనంబునతను

గెంటుకపోయిరో ♦ గెల్పుఁగొసంగ
తంటాలెఱుంగని ♦ దానికినాకు
ఎక్కువకష్టంబు ♦ లిప్పుడుగల్గె
నక్కమలాక్షుని ♦ నరగడియైన
చెలియగోవిడనాడి ♦ జీవించఁ గొత్త
పలి రాఘవుని పాద ♦ పద్మంబులాన

తే॥ గీ॥ అనుచుఁ బల్కెడిచెలిపల్కు ♦ లాలకించి
యతి కృపారసమాత్మలో ♦ నల్లికొనఁగ
కామమంజరి చెక్కిళ్లు ♦ గలయఁదువ్వి
అవుడు పూజారిభామ మా ♦ ట్లాడెనిటుల

దర్వు—శుద్ధకాంభోజిరాగం—ఆదితాళం

కాంతరో యీచింతవిడవమ్మ - నామాట గైకొని ॥కాం॥
సంతసముమది - నింతునినుమె - ప్పింతునిఁక న -వ్వింతునిజముగా॥

బేలవై యీ - లీలనుండఁగ - బాలజూడఁగ - జాలనిక్కము ॥కాం॥
కోఁటివినునా - మేటి నేస్తము - పాటిలినవల - దోటుఁజెందఁగ॥

పూనికోమటి - నేనిపిరా - ఖ్యేన కొత్తప - లీశునెంచుము ॥కాం॥

శా॥ నా వెంటన్జనుదెమ్ము పాదమిఁక వి ♦ న్నాణెంబుఁ జేకూరఁగా
నీవీవేళ ప్రయాసమొందుచును జ ♦ న్నేయుండ మాయింటిలో
నీ వేరితి భుజింపఁగోరినను వాని ♦ నిన్గూర్తు సందేహమే
లా విద్యుచ్ఛవిగాత్ర నీవరుని లీ ♦ లన్దెచ్చి నీకిచ్చెదన్

కందార్థము.

సందేహము నామాటల ♦ యం దేమియుగల్గనేని ♦ యదిమా
నుము రా♦ఖేందుముకేశు ఖ తురగయుతముగ ♦ తొందరగా లేఁచి

రమ్మి ♦ తోయజనేత్ర ♦ సౌవర్ణాతి ♦ ద్భాయసద్గాత్ర ♦ యీయెడ
ర్శాత్రినెం ♦ డామె మగవాఁడులేఁ ♦ డామె నీవిఁకఁ జాగు
సేయఁగవలవదు ♦ ధీయుతశాలి ♦ సంపూజిత ♦ శ్రీయుగ్వనమాలి॥

వ॥ అని యివ్విధంబున నవ్వసుధాధగస్తన కుపదేశించి కొంతసుఃఖంబప
నయించి మందయానంబులన్నోడ్డాఁకని చని నిజాలయసంస్థితంజేసి
సమస్త భోజనపదార్థంబులిడిన నాకొమ్మ యెమ్మెకాని పైన్నిమ్మిన
పరితాపంబున నర్థభోజనంబొనర్చి తద్గృహిణీయానతి నొక్కపక్క
పై న్నేనుంజేర్చి నిద్రించనేరక యాకుందగదనన్గాంది యిట్లనియె.

సీ॥ సరవితో నాప్రియుఁ ♦ జూడఁ దెచ్చినఁజాలు
తరుణిరో కాసుల ♦ దండయిత్తు
సొంపుగా నృపమౌళిఁ ♦ జూచివచ్చినఁజాలు
వెలఁదిరవ్వలనాను ♦ వేడ్కనిత్తు
అధిపునితోడ మా ♦ ట్లాడివచ్చినఁజాలు
కలికి తెల్లనిరాళ్ళ ♦ కమ్మలిత్తు
ఎలమినాతని భావ ♦ మెఱిఁగివచ్చినఁజాలు
కాంతరో బంగారు ♦ కంటెయిత్తు

గీ॥ చెన్నుఁదోఁపగ నెప్పట ♦ నున్నగాని
పాడిమీఱఁగఁ జెలికాని ♦ తోడితెచ్చి
కోర్కెఁదీరఁగ ననుహానిఁ ♦ గూర్చితేని
అగ్రహారంబొసంగెద ♦ నమ్ముపొమ్ము॥

కం॥ పతిఁగూర్తుననుచు నాతో
ప్రతిన యొనర్చితివిగాన ♦ పద్మేక్షణ త
ద్గతిఁజని పురమెల్లను హిత
మతివై వెదకి నృపుఁదెచ్చి ♦ మన్నింపగదే॥

వ॥ ఇవ్విధంబునన్గొనియాడిన నా యింతివల్కులు కంతరంగంబునన్మెచ్చి ఆ పూజారిణి తత్పట్టణంబునన్గల సమస్తవీధుల ననేక మర్త్యగృహం బుల వెదకి వేసారి క్రమ్మరిపోయిన కార్యభంగమునకున్వెరచి ఆదు ర్వార్త యమ్మింయచుబోణికెఱింగించ సంకోచించి చెప్పక తప్పనికతం బున నిజనికేతనంబున్జేరి గద్గదస్వరంబుతోఁ దద్వృత్తాంతంబెరిగిం చిన నుల్లంబు ఝల్లని సొల్లసోయి కొంతదడవునకుఁదెలిసి దుఃఖిత స్వాంతయై.

సీ॥ పురిలోనఁజొచ్చెనే ♦ వరకై నవచ్చునో
యనునాసలన్ని నేఁ ♦ డణఁగిపోయె
ననుఁబాసి యొకచోట ♦ ననువుగానుండఁడం
చును నాసలన్ని నేఁ ♦ డణఁగిపోయె
కపటంబుబూనఁ డె ♦ క్కడనున్న రాగలం
డనునాసలన్ని నేఁ ♦ డణఁగిపోయె
తురగంబుపైనున్న ♦ మరులుదేకుండునా
యనునాసలన్ని నేఁ ♦ డణఁగిపోయె

తే॥ గీ॥ తుదకు నీ మానినీమణి ♦ ముదమెలర్పఁ
బట్టణంబెల్లఁదిరిఁగి ♦ నెప్పట్టునైనఁ
దోఁడితెచ్చెనటంచను ♦ దొడ్డకోర్కి
యొక్కటుండెను నఃదీరె ♦ యక్కటకట

వ॥ ఇట్లునిజప్రాణ నాథావలోకన భ్రాంతికంతంరాయఃబొదవిన చింతా క్రాంతస్వాంతయై మనోకాంతున్గూర్చి

దరువు—కాపిరాగం—తాళంఆట

హానృపాలా - హా మోహనాంగ - సూనృతైక - శుద్ధాచారా॥హా॥
ఈ ప్రాణంబు - లిక నిల్పఁ - జాలా - నా ప్రాణేనా - నాథ
రా వేలా ॥హానృ॥

ఈవులేని - యీలోకమేలా - పావన న - న్యాయమేలా ॥హా॥
నిరతము కోమటి - నేని వీరయ్యా - వరదుఁడా కొత్త- పలిహారి
నెంచు ॥హాన్న॥

వ॥ అని యనేకవిధంబుల న్విలపించి ప్రాణత్యాగంబున కాయత్తపడి
కాళికాలయ నికటంబునం దేర్పరపించిన గుండంబునం బ్రజ్వరిల్లు
మహాగ్నికిం బ్రణమిల్లి చేతులుజోడించి.

సీ॥ తల్లిదండ్రులతోడఁ ♦ దగవుగల్గినమాన
చెలులెల్లఁ గోపగిం ♦ చినను మాన
పెంచినమంత్రితో ♦ మించిపోరినమాన
నొంటిమైభర్తతో ♦ నుండెమాన
ఊరివారెల్ల న ♦ న్దూరఁజేసినమాన
మిన్నసుఖంబు లే ♦ కున్నమానెఁ
గడగండ్లపైఁబై ♦ గ్రమ్మి వేచినమాన
గన్ననఁబెర వోట ♦ నవ్వమాన

తే॥ గీ॥ జన్మజన్మంబులకునాకు ♦ సరసుఁడైన
మఱియు నాచూడ్కులకు నవ ♦ మారుఁడైన
సజయ హేమాంగదన్నృపాల ♦ బాలవరుఁడు
భర్తగాఁగోరుదాన ♦ నీపాదమాన.

వ॥ అని గుండంబులో ధుమికెనంత

ఉ॥ నిద్దురబట్టుచున్నదియె ♦ నీకు నృపాలక భోగకాంతచేఁ
దిద్దినపూలపాన్పపయి ♦ దిక్కులునిండఁగ మందుమంటలో
ముద్దులమూట నీగరిత ♦ పొల్పుగ నిన్ననలేకధూకె సు
మ్మిద్ది నిజమ్ములెమ్మిగను ♦ మిప్పుడెనేఁ గగనాధిదేవతా

వ॥అనుపలుకులకులికిపడి దిగ్గునలేచి భోగాంగన యడ్డఁగించిన నిలువక
తద్గుండంబుకడకఁ గుగు దెంచి

ఉ॥ హాతరలాక్షి హాసుగుణ ♦ హానవమోహనగాత్ర హాసతీ
హాతతపద్మవక్త్ర కరు ♦ ణాలయ హామృగరాజమధ్యమా
హాతిలపుష్పనాస శర ♦ ణాగతవత్సల హామనోహరీ
హాతపనీయవిగ్రహ సు ♦ ధాధరనన్విడి పోవన్యాయమా.

సీ॥ సుక మేల నీతిపు ♦ స్తక మేలఁజూడఁగాఁ
బాలనీవీలీలఁ ♦ గాలిపోవ
పురమేలఁబచ్చక ♦ ప్పురమేలఁదావికై
బాలనివీలీలఁ ♦ గాలిపోవ
ధనమేల శతుృబం ♦ ధనమేలనిఁకనాకుఁ
బాలనీవీలీలఁ ♦ గాలిపోవ
హరియేల సుకృపాల ♦ హరియేల జనులపై
బాల నీవీలీల ♦ గాలిపోవ

తే॥ గీ॥ కటకటా నిన్నుఁబాసియే ♦ గతిజరింతు
నెటులభరియింతు నెవ్వరి ♦ నిఁకవరింతు
సత్యగతి జితకుంజరి ♦ సరసకామ
మంజరీవత్తు నినుఁగూడ ♦ మమతతోడ

సీ॥ మందారకుసుమము ♦ ల్మరిశలఁగల భర్త
వలయుమేభార్యగా ♦ వలయునాకు
ముద్దులమూటమై ♦ మురిపెంబుఁజూపిన
కలికియే భార్యగా ♦ వలయునాకు
వగఁజెందినన్నెగా ♦ దిగఁజూచితలయూచుఁ
జెలువయే భార్యగా ♦ వలయునాకు
వలరాజుకేళిలో ♦ పలఁజిక్కుపరచిన
లలనయే భార్యగా ♦ వలయునాకు

తే॥ గీ॥ నలమినేనెన్ని జన్మంబు ♦ లెత్తియున్న
నన్నిజన్మంబులీ మోహ ♦ నాంగియొత్తి

మనసుదీరంగనన్గూడి ♦ మలయువలయుఁ
బావనచరిత్రమోయగ్ని ♦ పవనమిత్ర.

చ॥ పలుచనిచెక్కులన్సుధల ♦ బాపికిఁ దీటగుమోవి తేనెల
న్గలఁచిన పల్కులన్గలిఁగి ♦ నన్నుసుఖంబులనేలినట్టి యీ
కలికి విరక్తిగుండమునఁ ♦ గాపురమున్నదిగానఁ దానితో
మెలఁగగ నేనుఁబోయెదను♦ మీరు రవిచంద్రులు సెల్వొసంగుడీ.

వ॥ అని యివ్విధంబున రాజన్యశేఖరుండు గుండంబున న్దుమికినఁ దద్వార్తయెఱింగి వేశ్యాశిఖామణియగు విలాసవతి తద్గుండంబు కడకరుఁగుఁదెంచి రోదనంబుఁజేయుచు

దర్వు—తోడిరాగం—జుల్వతాళం

నృపశిఖామణీ - నిన్నిపుడు విడనాడినే - నెటువలెఁ బ్రతికెద ॥నృ॥
అతిరతినన్గూడు - కతమున - నీభార్య - మతిఁజెడి యగ్గిలో -
మాయమైపోయెను ॥నృ॥
ఈపాపమునకెల్ల - నేపాత్రురాలను - నీపాదయుగమాన - నేవత్తు
నిన్గాన ॥నృ॥
నీటుగాఁ గోమటి - నేనిపీరయ్యను - ధాటిగానేలు కొ - త్తపలీశు
దయలేదు ॥నృ॥

వ॥ అని విలాసవతి యగ్నిఁ బ్రవేశించినఁ దనవెంటనంటియున్న చంద్రముఖయను దాసీరత్నంబుఁ గొంతసేపాలోచించియు ముప్పురిచావులకు పరితపించి పావకునిన్నూర్చి చేతులుజోడించి

క॥ ఈముప్పురిచావులకును
నేమొదలిటిదానఁగాన ♦ నేనిఁకనుండ
న్గామోదమెనయ దెదకుఁ గృ
పామహితుఁడనిన్నుజొత్తు ♦ పావనమొందర.

వ॥ అనియు చంద్రముఖయు న్గుండంబులో ధుమికిన నంతకాళికాదేవి

వారందఱి నిశ్చలహృదయంబుల కానందంబొంది అందఱినిస్సృవర్ణివి తుడన్జేసిన వారందఱుత్పలతామరస నేత్రంబుల నక్షాళికాదేవినిఁ జూచి తత్పాదంబులకు బ్రణమిల్లి నయపూర్వకంబుగా

పంచామరము.

నమోనమో సరోజలోచ ♦ నా శివప్రియేసదా
నమోనమో బుధాసుతోష ♦ ణా హరిప్రియేడితా
నమోనమోనమో ప్రదాన ♦ నవ్యహస్తకంకణా
నమోనమో సమస్తలోక ♦ నాథ బాధభంజనా

వ॥ అని స్తోత్రంబొనర్చి పిమ్మట హేమాంగదుం డంగజ బాణ భగ్న హృదయుండై కామమంజరికరంబు తన కరంబునఁ గీలించి లాలించఁ దలచి యిట్లనియె.

సంవాదము—యాలలు

హే॥ ఇంతసాహసంబుఁజేసి - లింతలోనెతొందరించి - కాంతనీకుఁ గోపమేలానె - ఓకామమంజరీ - శాంతమింత నెటుబఁబోయెనే॥

కా॥ ఎంతవాఁడవహహ యుక్తి - సంతొషించి మాట్లాడెదవు - వింతలాయె నీదు చెయ్యులు - ఓహో - ప్రాణనాథ -పంతముసాధించఁ బోదువు॥

హే॥ గ్రామమునుఁబోవలెనంటోయి - కడపకడపఁ దిరిగితిరిగి - భామ పొందనైతిపిష్టము - ఓకామమంజరీ - యేమనిజెప్పుదుఁ గష్టము॥

కా॥ దొరుకకుంటెమా నెనీవు - సరగునవచ్చితేఁగాదా - తరుణి యున్న మాటయెఱుఁగవా - ఓహో - ప్రాణనాథ పరులెవా రున్నారునన్నోర్చవ॥

హే॥ ఇయ్యెడదఁజూచియున్న - మియ్యాగాఁ జీవించినాఁడ - యిమ్యెడనేరంబూనినాఁడ - ఓకామమంజరీ - తొయ్యలినన్నేలు నీ వాఁడ॥

కా॥ ఏనఁదాని-కేమాయెని - న్నదెవ్వరో న్నపాల పూనినీదు
దర్శనమాయెను - ఓహో - ప్రాణనాథ-కానున్నది కానేకానాయె॥

హే॥ నాతప్పులేమైననుంటె - నాతీవానినెల్లమాని - కాఁతరో
నన్గవుగలించవె - ఓ కామమంజరీ - నీతితోడ ప్రేముడించవె॥

కా॥ కోమటినేనివీరయ్య - కామదుఁడు కొత్తపల్లి - ధాముఁడైన
రాముఁడుబ్రోచె - ఓహో - ప్రాణనాథా - వేమరు చల్లగాలివీచె॥

ఉ॥ భోగముడైన యీచెలియ ♦ పుణ్యచరిత్ర పరోపకారి యు
ద్యాగత రక్షణోత్సవ శు ♦ భాంగి భవత్ప్రియగానఁ దాసితో
నీగగనప్రవమధ్యనర ♦ హిన్గొని పోఁదము రమ్మయింటికిఁ
సాగరరాడ్గభీరమ్మగ ♦ శౌర్యరిపుప్రబలప్రభంజనా.

వ॥ అనిపలికిన సంతసించి విలాసవతి చంద్రముఖు లక్కాంతాకాంతుంబు
నకు ప్రణమిల్లిరి, అనంతరంబ హేమాంగదుండు వారల బల్యంకి
కాసీనలజేసి తానింద్రాయుధంబు నందధిష్టించి తగువైభవంబుతో
నిజరాష్ట్రంబగు సింహళంబునకుఁజనియె. అనిచెప్పిన విక్రమా
ర్కుండు సంతసించెనంత.

మంగళహారతి—రాగం కేదారగౌళ తాళం ఆది.

మంగళం శ్రీ-రంగసజ్జన - సంగకుంతల - భృంగ- రంగ - స్మంగ
శాంగ ॥మంగళ॥

తుంగ ఖగపతు - రంగప్లుషితకు - రంగకల్మష - భంగ - చంగ-
లింగనుత ॥మంగళం॥

హారికామ్రభ - హారిదైత్యావి - దారిపూర్ణిమ - సార-సారి-
చారుముఖి ॥మంగళం॥

ధీరసత్కవి - వారనిత్యా - ధారకల్పక - హార-హీర-
తారకీర్తీ ॥మంగళం॥

నీల-బాలతమాలబంధుర-నీలకర్పుర-చేల-నీలా-లోల-శ్రీల॥మ॥

బాల-తులసీ-మాలశ్యామ-లవ-కాలకరుణా-జాల-తాలాం-త్రాతే-
ప్వాస- ॥మంగళం॥
భూమి కొత్తాప- లీమహీజా- కామసంగర- భీమ - కామ-కామ
గుణ- ॥మంగళం॥
నీమకోమటి-నేనివీరయ్య-కామ దాయక-రామ-ధామ-ధామ
వంశ- ॥మంగళం॥

మంగళహారతి—తోడిరాగం—ఝంపతాళం.

హారతిదుగో రాఘువ- మంగ- ళారతిదుగో రాఘువా- హారతిగొన
వయ్యా—హరి-పిహరి నీ—చేరువఁజేరినవారమయ్యా-కారుణ్యమయ
భావ-ధారుణీజా దేవ-మారశతాకార-మౌక్తికయుతహార॥హారతి॥
నీరాజసముఖ-సిద్ధముఖ-నీరాష్ట్రపాలన-నీకూరిమి- యోరా
జులందున నెఱుఁగిము నిక్కము-దారితభృగురామ-దైత్యసంఘ
విరామ- ॥హారతి॥
నందితవానర-బృందసత్కవిజన-సుందరనినుఁజూడ-మాకందము-
మందారాచలధీర-మాధుర్యవాగ్సార- కుందరదన భక్త - కువ
లయహిమకర ॥హారతి॥
పూనికఁగోమటి-నేనివీరయ్యకు-మానితార్థములిచ్చి మన్నించెడి-
భానుగోత్రజ కొత్త-పల్లి సావర్ణని-ధానసర్వార్థ సం-ధాన భక్తా
ధీన- ॥హారతి॥

మంగళహారతి.

వనితరో మంగళ హారతులివ్వరె - యినకుల జలనిధిసోమునకుఁ -
జక్కని - మనసిజ రూపునకు - దశరథ - జనపతి తనయునకు -
దానవి - వనిలోఁ గూల్చిన - ఘనబలాఢ్యునకు - మునియాగ
ముఁగా - చిన నరవరునకు ॥వనితరో॥
హరుకోదండము విఱిచియు సీతనుఁ -బరిణీయ మాడినశూరునకు-
దండక - ధరణివిహారునకు - ఖరముఖ - సురరిపు దూరునకు-

## కామమంజరీ పరిణయము.

వాలినిఁ - బరిమార్చియురవి - భవుని పృథుచర - పురిసేలించిన-
పురుషోత్తమునకు ॥వని॥

అనిలజుచే మైథిలివార్తనువిని - వనచరయుతుఁడగు భూపునకు -
రావణు - ననుజునిఁ బ్రోచిన దేవునకు - సేతువు - వనధికిఁగట్టిన
ధీరునకు - దశశిరు - దునుమాడియువే - జనకజఁదోడ్కొని -
చని సాకేతను - మనిచిన ఘనునకు ॥వనితరో॥

కోమటినేని సు - కులుఁడగు వీరయ - కనుసిరులిచ్చు శ్రీరాము
నకు -- నీరద - శ్యామల దేహునకుఁ-గౌస్తుభ-లీమణిధామునకుఁ-
గమలజ - కోమలాననలు - గుమురై పాత్రము - లామోదం
బుల - హస్తములంటిరి ॥వనితరో॥

ఇది శ్రీ గిరిపాటివాస శ్రీమద్రామచంద్ర సమ్యగనుగ్రహసాదిత
సరస కవితా విచిత్రాత్రేయస గోత్ర సరికొండకోటమ
రాజపుత్ర సుబ్బరాజ సోదర రామరాజకవి
విరచితంబైన కామమంజరీపరిణయము
వీధినాటకము సంపూర్ణము.

